మొనకట్టి, యాసూచి మూలభాగమునఁ । దనర సేనలను సైంధవు నంత నిలువ
నేమించి మొనల కన్నింటికిఁ దాను । మోహమైనఁ, జూచి యా మొగ్గరంబునకు
నెదురెందు లేదని యెన్నఁడునిట్టి । చదుకు చూడమటంచు జగములు వొగడె.
అది లోకముల గ్రమింగ నభవుండు తెఱచు । వదనంబుఁ బోలె నుజ్జ్వల భీమరేఖ;
నిట్టి కూటవ్యూహ మెందఱు నడఁపఁ । బుట్టెనో! యన భీతి పుట్టె దివ్యులకు.
అక్షీణమతి నంత నావ్యూహమునకు । వీక్షింప నొకలక్షవిండ్ల దూరమున
నేనె నిల్పుదుఁ గ్రీడి నిపుడంచు నేన । తో నిల్చె నంతట దుర్మర్షణుండు.
మొనకు వానికి నడుమ మొగి యువరాజు । తన సేనపనుండె ధవళాశ్వ నాఁగ.
ఆలోన యోధు లిట్లనిరి: "గాండీవి । యేలకో రాఁడయ్యె నింత సేపయ్యె!
పొలుపేది గ్రాఁగెనో పుత్త్రశోకాగ్ని! । మహి నింత వెఱచెనో మాటాడి వెనుక!
వచ్చెఁబో తన కిది వశమె భేదింప! । నిచ్చట గురుఁడని యెఱుఁగఁడె మొదట!
ధర్మజ భీమ సాత్యకులేల తడసి? । రర్మిలి నేలకో హరి నారిఁ దేఁడు!"
అనిరి; కొందఱు: "వార లభిమన్యుఁ జీల్గ । నని మాని యడవుల కరిగెద" రనిరి.
మఱి కొంద: "ఱిట్లెల మనకబ్బు జయము! । పఱతెంతు రిదె వారు ప్రతినకు" ననిరి.
అప్పుడు [1]కడగంట నాభీల కీల । యుప్పతిల్లఁగఁ దీవ్ర హుంకృతితోడ
గాండీవ జ్యానాద ఘన శంఖనాద । చండ భూత నినాద చటులత తోడ,
నిరవధి హరిశంఖ నినదంబుతోడ, । ... ... ... ... ...
భూరి కుంభ ద్రోణములు వట్టికురియ । మూరిఁబోఁ బన్నిన మొగిలును బోలె
హరి సూనుఁడొడరంగ నఱవింటి నేలఁ । గురుసేనఁ గదిసి యగ్గోవిందుఁ బలికె:
'ఇది శకట వ్యూహ మింద్రాది భయద; । మిదిగాక యిందులో నింక వ్యూహంబు
పన్నకమానఁడు ప్రౌఢుఁడు గురుఁడు; । తన్నుఁ జూచితె! యొడ్డుతల నున్నవాఁడు;
ఆతని దాఁటి వ్యూహము చింపకున్న । నే తెఱంగున నోడు[2]సీయెడ దాయ?
పిసిరి వచ్చినయట్లు పెద్దతికమున । నాసతో నొంటి నన్నాఁగ రానోపు (?)
దుర్మర్షణుఁడు వీఁడు తొలిముద్దమునకు । దుర్మదాంధుని మీఁదఁ దోలుము రథము."
అని వాని బహుళ సైన్యంబుపై రథముఁ । జననిచ్చి భీకరాస్త్రపుజడి వెట్టి
కాలు బంట్లును హరుల్ గజరథములును । తూలఁ దుత్తుమురుగాఁ ద్రుంచి తూటాడి

1. కటికిల. 2. నేడాయె. (మూ)

యొక్కటఁ ద్రెవ్విన యోధకంఠముల । నిక్కి నెత్తురు నింగి నిలువఁ గడఁగ,
లీల సౌభద్రుఁ గూల్చిన యల్కఁబోతె । నోలిఁ జెక్కుమ్ము లొక్కొక్కనిఁ బొదువ
గాండీవి లయకాల కాలుఁడై మఱియుఁ । జండిమఁ దను గప్పు శత్రుల చేతి
శరపంజరంబులుఁ జక్రమండలముఁ । బరిఘ ప్రవాహంబుఁ బ్రాస సంచయము
ననమ గదావ్యూహ మసిపత్రవనము । ముసల ముద్గరముల మొత్తంబుఁ జదిపి
యతని సైన్యము నిమిషార్ధమాత్రమున । క్షితిమీఁదఁ బడనేసి చెలఁగి యగ్గలిక
మర్మవర్మంబులు మఱి త్రెవ్వనేయ । దుర్మర్షణుఁడు పాఱె ద్రోణుని కడకు.
అంత వేగంబుతో నరుదెంచునరుని । దంతావళంబుల తఱుచుతో వచ్చి
యువరాజు తాఁకిన యుద్ధమయ్యెడను । దివిజ భీకరమయ్యె దేవ, యేమందు!
మారుత హయముక్త మాంసపంకముల (?) । వారణంబులు గ్రుంగ వానిపైనుండి
కీలూడి రథములు కెడయ నమ్మీఁదఁ । గాలుబంటులు దాఁటి కడిమినేయుదురు.
ఒంటివాఁడని మొననొనర నాసాస । గెంటుక చొచ్చి యాక్రియ నేసి యేసి
... ... ... ... ... । ... ... ... ... ...
హరిమీఁద హరులపై నట హరిమీఁద । నరదంబుమీఁద నిజాంగంబు మీఁదఁ
బడనీఁడు తూపులఁ బార్థుఁ; డపార్థు । వెడతూపులైన నీవీరులఁ దాఁకి
శిరములు [1]చరణముల్ సెలవులు మొలలు । నురములుఁ గరములు నూరులు బరులుఁ
దనువులు హనువులు ధ్వజములు భుజము । లొనరఁ ద్రుంచుహరించు నొగిఁ జించునొంచు.
అంతఁ గాల్వురు నొవ్వ హస్తులు వివ్వ । హాంతకాఁడై పాఱుయువరాజుఁ గ్రీడి
నిలువు దుశ్శాసన, నీకుఁ బోఁదగునె! । తలఁపవె! తొల్లింటి దారుణ క్రియలు;
నాఁటివారమె కామె నడుక నేమిటికి? । పాటించి తెమ్ము సౌబలుఁ డెందుఁ బోయె?
ప్రాణశాంతి యొనర్పు పరిపాటి నకట । ద్రోణునిమాటేల దూఱఁబోయెదవు?
ఇటు మాయమృగమవై యెందుఁ బోయినను । వేఁటాడ కుండునే భీముండు నిన్ను (?)"
అని వాని పెడతల యమ్ములు నాటి । తనపూన్కి తలఁచి యొంతయుఁ దత్తరమున
ద్వారభీకర భరద్వాజు చాపమునఁ । బోరాని యొడ్డనంబున కగ్గలించి,
దురము ద్రోణాచార్యుతోఁ గొంతసేపు । దొరఁకొని యది పెద్ద త్రోపికయున్నఁ
గటకటఁ బడుచోటఁ గైటభారాతి: । "యిటుగాదు, ప్రొద్దుపోయెడు నీకు నిచట

---

1. శరములు శలములు మలవు. (మూ).

గురుని నింద్రాదులకును గెల్వనరిది; । నర, యాగ్రహము మాని నాబుద్ధి నతని
ననుచరింపుము కొంత యంతతోఁ బోదు; । అనువుగాఁ బలికిన నూనోరుపోదు."

## అర్జునుఁడు ద్రోణునిచే ననుజ్ఞాతుఁడై మొగ్గరంబు చొచ్చుట

అనినఁ బ్రదక్షిణం బతనికి రథము । చననిచ్చి గాండీవి శరముల మ్రొక్కి
యా పార్థుఁ డిట్లను: "నాజి నేమఱక । చేపట్టి విడుతురే శిష్యుని నన్ను!
తూలక నీతోడ దురమొనరింప । వేళగాదిది ద్రోణ, విడు నాకుఁ ద్రోవ;
నత్యమే నీకు నశ్వత్థామ నూఱు; । నిత్యంబు గల కృప నేఁడేల మఱవ?
ఎన్నఁడు నెదిరి నన్నేయకు మయ్య! । నన్నేయ నిన్నేయ న్యాయమా మనకు!"
అనిన నవ్వుచు ద్రోణుఁ: "డర్జునా, తగునె! । నిను జొరనిచ్చుట నృపకార్యహాని;
కొలిచిన వారికిఁ గూడునే కృపలు! । నిలిచి పోరుదుగాక నీకేది త్రోవ!
గురుఁడని నన్ను డక్కులఁ బెట్టి చొచ్చి । పరులఁ ద్రుంచిన నీకుఁ బట్టునె బాస!"
యనుచు ద్రోణుఁడు భీషణాస్త్రవర్షమున । వనమాలి నరు తేరు వాజులఁ గప్పి
గాండీవ శింజిని ఖండించి యార్వ, । నొండునారి బిగించి యుగ్రుఁడై నరుఁడు
లయకాల కీలి కీలాలోల విశిఖ । చయముల గురుని నచ్చోఁ జిక్కుపఱచి
చొచ్చినమాత్ర, నర్జునశరావలియుఁ । జొచ్చె నొడ్డనఁగల సుభట దేహముల.
మకరి ముఖమునఁ దొల్లి మారుతి చొచ్చు । ప్రకృతి మొగ్గరమిట్లు పార్థుండు చొచ్చె.
తన పార్శ్వములు చూచి తనతోడఁ గూడి । చనుదెంచు యోధులఁ జక్రరక్షకుల
నొనర యుధామన్యు నుత్తమౌజసునిఁ । గనుఁగొని వారిరాకకు సంతసించి,
త్రెళ్ళఁగాఁ గాల్కొని దెసలెల్ల రిపుల । పెల్లైన నచ్చోట బెదరక నడచి
వెనుక నాచార్యుండు విడువక తగుల, । మునుకొని కృతవర్మ ముందటఁ దాఁకఁ,
గలఁగి శ్రుతాయువుఁ గాంభోజపతియుఁ । దన పార్శ్వముల నెక్కఁ, దగునేన లెక్క,
నక్కడి కాముఖంబై యున్న పగిది । నెక్కడికిని ముఖంబెడలని పగిది
నన్నిముఖంబులై యమరేంద్రసుతుఁడు । వెన్నుఁ డాగతిఁ దేరు వేరొప్పనేసె
ధ్వజచర్మ నూతాశ్వ ధనురస్త్రతతులు । రజములుసేయ నుగ్రత ద్రోణుఁడలరి
నరుని డెబ్బదిమూఁడు నారాచములను । సరసిజోదరు నన్నిసాయకంబులను
నాటించి దివ్యబాణంబులు మఱియు । మీటినఁ, గ్రీడి యేమియు లేఁచికొనక
యులుగు లేసినయట్లు యతని వంచించి । తొలఁగి యా కృతవర్మతోఁ దలపడినఁ,

జేయ నేదియులేక సేనా ముఖమున । కాయస్త్రగురుఁడేఁగె హరి నిక్కి చూడ.
ఇటఁ గృతవర్మ యయ్యింద్రజు శౌరిఁ । బటు బాణములఁ గప్పఁ బదరక నరుఁడు
విల్లు ద్రుంచెను ; ద్రుంప వివరింపరాని । యల్లీల నొండు వి ల్లతఁడు ధరించి
మున్నిటికంటెను మోపుగా నేయ, । వెన్నుఁ డర్జునుఁబల్కె : "వీఁడుగ్రబలుఁడు ;
మోమోడఁ బనిలేదు ; ముందఱఁ గలఁడు ; । నీమార్గణాగ్నులు నిగిడింపు." మనిన
నవ్వుచు నిరువది నారసంబులను । నివ్వచ్చఁ డాజోదు వివశుఁగా నేయ,
నటఁజొచ్చి కాంభోజుఁడగు శ్రుతాయువుని । బటుగతిఁ దాఁకిన వరిపాటి తెలిసి
చయ్యన నర్జును చక్రరక్షకుల । నయ్యెడఁ గృతవర్మ యమ్ముల నాఁగె.
అట్టాఁగ వారు[1]ను హార్దిక్యుమీఁద । గట్టిపాఱమ్ముల [2]గఱిగఱి మోవఁ
బరఁగింప, నప్పుడు పాంచాలవరుల । యురుతర కోదండయుగము ఖండించి
ముఖమున శితశిలీముఖమున నాట । సుఖమాత్ర వార లర్జునుఁ గూడలేక
యద్రిఁ జిక్కిన ప్రవాహములును బోలె । నుద్రేకమునఁ గానకుండిరి తెరువు.

## అర్జునుఁడు శ్రుతాయుధ ప్రముఖ యోధులఁ జంపుట

అంత శ్రుతాయుధుండను మహారాజు । కౌంతేయుమీఁద నక్కాంభోజుఁ గడచి
యరదంబు పఱపి సాయకయుగళమున । హరినాటి హరిపతాకాగ్రంబు నాటి
సవ్యసాచిఁ బదాఱుశరముల నాట, । నవ్యయుఁడై పార్థుఁ డవ్వీరు తేరు
సుభటవర్గంబుతోఁ జూర్ణంబుసేయ । నభినవ గదగొని యతఁ డుర్విఁ వ్రాలి
యాగద నటువైవ, నది పుష్పమాల । బాగయ్యె నురముపైఁ బార్థివ, హరికి.
వరుణాత్మజుఁడు వాఁడు ; వానికగ్గదయు । వరుణుని యీఁగి ; యవ్వరుణుఁ డట్లిచ్చి,
"యన్న, కుమార ! యీ యాయుధంబున్న । నిన్ను నింద్రాదులు నేరరు గెలువ.
[3]వెడ నిరాయుధుమీఁద వేయకు దీని. । నెడపకవైచితే నిది వానిఁ గాచి
తిరిగి నిన్నువధించుఁ దెలియుమీ." యనిన । వరుణవాక్యము నాఁడు వాఁడును మఱచె
విను మాలికాకృతి విడిచి యగ్గదయు । వెనుకకు నిజపూర్వ విధమొప్పఁ గదలి
పార్థునిచే మున్ను బాహులు దెగిన । పార్థివు నాతని భస్మీకరించె.
అతఁడిట్లు గూలిన నంతఁ గాంభోజ । పతి దాఁకఁ గవ్వడి పది నారసముల
ననువున నాటిన, నా సుదక్షిణుఁడు । ననువున బాణారి నైదు బాణముల

1. మహాధిక్యు. 2. గరగరి. 3. వడి. (మూ)

జవ మొప్ప నప్తుల శరసప్తకమునఁ । గవిసి యగ్గాండీవిఁ గాండత్రయమున
గ్రుచ్చి యార్చినఁ, గ్రీడి కోపించి వాని । యుచ్చులతోఁ గోదండ మొకకోల నఱికి
కాయంబుతో గుండెకాయ వేఱొక్క । సాయకంబునఁ ద్రుంప సమసె నయ్యోధ.
ఎచ్చోట నేవీరుఁ డీల్గు నింద్రజుఁడు । నచ్చోట నతనిసైన్యము బాఱి[1]సమరు.
ఇందఱఁ ద్రుంచియు నిచ్చలోఁ బ్రీతిఁ । బొందఁడాతఁడు దాయ పొడగానమికిని.
ఆరీతిఁ గాంభోజుఁ డనిలోనఁ బడిన । మేరువు మూఁగిన మేఘంబులనఁగ
[2]సేనలార్వ వసాతి శిబి శూరసేన । మానవనాథులు మఱి క్రీడిఁ బొదివి
ముట్టడ చేసిన, మునుకొని యతఁడు । గట్టికోలల జడి కడముట్టఁ బెట్టి
యాఱువేల రథంబు లందు రూపణఁపఁ । బాఱిరి నిలువక భగ్నులై వారు.
అట శ్రుతాయువు నయుతాయువు ననఁగఁ । బటు శౌర్య వీరులు పార్థివోత్తములు
శక్రజు నుభయ పార్శ్వంబులఁ దాఁకి । విక్రమంబునఁ దీవ్ర విశిఖంబు లేసి.
రందుఁ దోమరము శ్రుతాయువు వైచె; । నందు శూలము నయుతాయువువైచె;
నవి రెండు నర్జును నదరంటఁ దాఁక । వివశుఁడై మనసేన వెసనార్వ నొఱగి
హరి తెల్పఁ దెల్వ రూఢాత్ముఁడై తెలిసి । హరిసూతి వానిపై నైంద్రాస్త్రమేయ
నది వివిధాయుధాయత రూపధార । లొదవ మంటలు మింట నొలుకుచు నిగిడి
యశ్రమలీల సైన్యములతోఁగూడ । నా శ్రుతాయువు నయుతాయువుఁగూల్చె.
అంత నయ్యిరువురి యాత్మసంభవులు । కౌంతేయ, నిలుమని కడిమిమైఁ దాఁకి
యనిసేసి నియుతాయువనఁగ దీర్ఘాయు । వనఁగఁ దంద్రులఁ గూడి యరిగిరి నృపులు.
మఱియు నెవ్వరుఁ గ్రీడి మార్కొన వెఱచి । చఱచిపోఁ జూచిన, సర్పకేతనుఁడు
ప్రాచ్య కళింగాంగపతులఁ గైరాత । వాచ్యులఁ గరిఘటావంతులఁ జూచి,
యర్జునుపైఁ బడుఁడని పంపువెట్ట । గర్జిల్లి నీలాభ్రగతి వారు గదిసి
శిలల [3]వ్రజములు వర్షించి ఘోరముగఁ । బలుతూపు లర్జునుపై జడివెట్ట,
నసలాస్త్రమునఁ గ్రీడి యయ్యంపగముల । నును ధూళి చేసి వెన్నుఁడు మెచ్చ నపుడు
గారుడాస్త్రము ప్రయోగముసేయ నచట । లేరైరి లెక్కమాలిన బోయలెల్ల.
నంతఁ బాఱె దశార్ణయవన సైన్యములు. । నెంతయు మొనవివ్వ నెదురేది క్రీడి
మడుఁగుఁ జొచ్చి కలంచు మాతంగలీల । జలధి చొచ్చి కలంచు శైలంబు పోలె

1. పరమి. 2. జేనసాల్వ. 3. వజ్రముల. (మూ)

వనము చొచ్చి కలంచు వనవహ్ని పగిది । మనమూఁకలకుఁ జొచ్చి మర్దించునపుడు
మిట్టుఁ బల్లము నిండి మింటికిఁ బోరాయు । నట్టాడె నెత్తు రయ్యాజిరంగమున.
అంబష్ఠవిభుఁడు శ్రుతాయువునపుడు । పంబినగతిఁ గ్రీడిపైఁ దేరు పఱపి
ధారాళ శరవృష్టి ధనువుఁ గేతనము । శౌరిరథంబు నశ్వములఁ గప్పుటయు
శంబరాంతకుఁ దొల్లి శంభుండు వోలె । నంబకశిఖిఁ గ్రీడి యతనిఁ దాఁ జూచి
యుందంద పైపైని నతి నిబిడముగ । నందడించు బలంబుఁ జక్కాడఁ దొడఁగె.
జగదేక రథికత జగతి నేర్పడఁగఁ । దగులక నపుఁడిట్లు తఱిమిరాఁ జూచి
నిట్టూరిచి కలంగి నృప, నీకుమారుఁ । డొట్టిన తనపౌఁజు నొక్కభంగి నిలిపి,
సేనాముఖమునకు శీఘ్రుంబె వచ్చి । యా నెలవుననున్న యాచార్యుఁ బలికె:

## దుర్యోధనుఁడు ద్రోణుని దూఱనాడుట

“క్రీడి రా విడిచితి కృతమేది యింకఁ? ।బాడు గావలియుండఁ బనియేమి యిచటఁ?
బడె నోవకుండ సర్పము చావకుండ । నడపెడు కార్యంబు నా ముచ్చు గురువ!
పాతకంబున నిన్ను బాండవపక్షు । పాతి నమ్మితిఁ గోలుపడితి సైన్యముల.
నీ వర మెటు వోయె? నిజమెందుఁ బోయె? । నేవెంట నమ్ముదు నెవ్వాని నింక?
వలెనన్న నీకును వైరులు వేఁగె! । మెలప నిట్టివియయ్యె మీతోడి పనులు ;
నమ్మెఁగదే! మిమ్ము నా ముద్దుమఱఁది; । యిమ్మైన యపకీర్తి కేల భీతిలవు?
అతని కడ్డంబున్న యందఱు నింద్ర । సుతుని కయ్యమునకు స్రుక్కుచున్నారు.
తేనియవ్వాఁతకత్తివిగాక నీవు । మానిసివే! యిట్టిమాటలు వలసె.
నీబాణములఁ బార్థు నిలుప ర.” మ్మనిన । నాబేలఁ జూచి ద్రోణాచార్యుఁడనియె :
“కూడ, దేముదునలిఁ, గూడి రానోప; । నీడాక నర్జును నిలుపుము పొమ్ము.
పగగలవాఁడవు; భావ్యంబు నట్ల; । తెగవు మాచే నంతఁ దీఱనిపనులు.
కవచధారణ మనఁ గల దొకవిద్య । యవనీశ, యిత్తు నీ కవసరంబగుట.
అది [1]గల్గ నెచ్చోట నర్జునాస్త్రములఁ । జెదరవు బెదరవు శ్రీపతికైన.
చతురాననుఁడు తొల్లి శంభునకిచ్చె; । నతఁ డంత దీని బృహస్పతి కిచ్చె ;
అగ్నివైశ్యున కిచ్చె నాబృహస్పతియు ; । నగ్నివైశ్యుఁడు మఱి హత్తించె నాకు ;

1. గల్గియిచ్చిన. (మూ)

అది సాధనంబుగా నాఁగుము నరుని ; । కదలక నాకు నిక్కడఁ గావవలయు.
పరఁగి పాండవసేన పఱతెంచు నింక । నురలఁ ద్రొక్కెడి మఱి యొడ్డెల్ల నధిప !
ఏమన్న మఱి నీకు నిచ్చిన వరము । రానేర్చు నరుఁ బాసి రాజున్న వాఁడు.
ఇంద్రతనూజు ని శ్లేను రా విడువ । నింద్రాదులును వారి కెదురె కయ్యమున !
ఆ నరనారాయణాఖ్య యోగంబు । మానదు రాజేంద్ర, మన మన్నిగొనక.
ఎట్లైన గెలుతు మనేక యత్నములఁ । బట్టుచు బిట్టు నోఁ బలుకకు నన్ను."
అని ద్రోణుఁ డప్పుడు నట దివ్యకవచ । మొనరిన మంత్ర ప్రయోగంబు చేసి
దుర్యోధనున కది తొడిగి దీవింపఁ । దూర్యరావంబులతో మిన్ను దాఁకి
గురునకు మ్రొక్కి యక్కురురాజు గదలి । పరువడి పోచుండెఁ బార్థు వెన్ దగిలి
ఆ పాండురాజ పుత్త్రావళి సేన । యీ పార్థుఁడేఁగిన యిక్కవ నడచి
ద్రోణాది యోధులతోఁ దలపడినఁ । బ్రాణ భీకరమయ్యె బవర మచ్చోట.
నొగ నొగతోఁ దాఁకి నుగ్గైన రథము, । పగ పగతోఁగూడ భగ్నమా బంటు,
తల తలతోఁ దాఁకి తగ్గు నేనుంగు, । నలి నలిగాఁ బోరి నాశిల్లు హయము
నిడివి గల్గుటఁ జేసి నెత్తురుటేరఁ । బడి పాఱె నయ్యాజిఁ బార్థివ, వినుము.
అడగొని పీనుఁగు లాప్రవాహమున । వడిసెల మొఱములు వైచుచు డొల్లె.
ఎక్కలి వెట్టిన ట్లిభతురంగముల । డొక్క లొక్కొక్కచోటునఁ దఱచయ్యె.
అట్టి జన్యమున సైన్యము లొక్కడొకని । గిట్టియదల్చుచుఁ గినుకమై నెక్కి-
లయకాల కీలి కీలలఁబోని కోల । లయుత సహస్రసంఖ్యల నేసి యేసి,
యతుల శూలములు మహాముసలములు । ప్రతిలేని గదలు నేర్పడ వైచివైచి
శక్తిపాతమ్ములఁ జక్రపాతముల । ముక్త ముద్గర పాతముల నొంచి నొంచి,
పల్లవితాశోక ఫలితవటాభ । సల్లలితాకృతి చాలఁ బొందియును
జావు నొప్పెఱుఁగక జయకాంక్షఁ బెనఁగె. । ఆవేళ భీముపై నంగాధిపతియు
సరభసమతి వివింశతియును దాఁకి । శరభసమాన శస్త్రములేసి రథిప !
ద్రౌపదేయులఁ దాఁకెఁ దనర బాహ్లికుఁడు । చాప విద్యాప్రౌఢి జర్జరితముగ.
పంచేంద్రియంబులు ప్రాకృతుఁ బోలె । వంచిరి శరముల వాని నా నృపులు.
దుశ్శాసనుఁడు తేరుదోలి శైనేయు । నిశ్శంకఁ [1]దాఁకి తునియఁ జేయుటయును

1. గోపించి. (మూ)

గుధరంబు వఱదఁబోఁ గురియు మేఘంబు । విధమున నతఁడేసె వేవాఱ నతని.
నకులుని సహదేవు నానాస్త్రతతుల । శకునిఁ గప్పిన వారు చలము రెట్టింప
రవిచంద్రు లంధకారవు గుమి విప్పు । తివుట విప్పిరి వాని దిశలకు నొదుఁగ.
ఖండితారి శిఖండిఁ గడు నలంబుసుఁడు । నందాసగాని యేయ నలిగి శిఖండి
గుహుని శిఖండి రక్షోపిరునొంచు । వహణి నాతని నొంచె వాలంపగోళ్ళ.
సైంధవుఁ గాచున్న శల్యుండు సమర । బంధురుఁ డప్పటప్పటికి వచ్చుచును
ధర్మనందనుఁ దాఁకి ధర్మజు పూర్వ । కర్మము దాఁకినగతి నొంచిపోవు.
తక్కటి యోధులు తమయీడు వెదకి । యెక్కటెక్కటిఁ బోరి రీభంగిఁ గవిసి.
అంతఁ బోవక పాండవావలి నరుని । నెంతయుఁ గూడఁబోయెడు తమకమున
నొత్తి యెక్కిన, మనయోధులు కలఁక । నెత్తిపాఱఁగ, ద్రోణుఁ డెదురెక్కియార్చి
శమనజు భీము ధృష్టద్యుమ్ను నొంపఁ, । దెమలెఁ బాండవసేన తెలిసె నీసేన.

## ధృష్టద్యుమ్న ద్రోణాచార్యుల యుద్ధము

అందు ధృష్టద్యుమ్నుఁ డాచార్యు రథముఁ । గ్రందుగాఁ దఱుము నుగ్రపుసాహసమునఁ
గరముల నసి ఫలకములు వెలుంగ । గురుబాణములఁ ద్రోచుకొని నొగలెక్కి
యరుణాశ్వముల నొంప, నతఁ డొకభంగిఁ । బరఁగ నాతనిపాలుఁ బలుకయు నఱకి
పారువంబులవన్నెఁ బరఁగు తద్రథము । వారువంబులఁ ద్రుంచి వానిపై మఱియుఁ
జంపనోపిన నారసము ప్రయోగింపఁ । ద్రుంచె సాత్యకి నడుమఁ దుమురుగా దాని.
అట్టిపోటున బాణ మతఁ డెత్తి శ్వేతు । నెట్టన నిజరథనిహితుఁ జేసినను,
అబ్బినమాంసంబు హరియింప నలుగు । బెబ్బులిచందమై పృథివీశ, గురుఁడు
బలుపెల్ల సాత్యకిపై ప్రయోగించు । తలఁపున నిగుడ, నాతఁడు నోసరిలక
సారథి కాజి హెచ్చరిక తాఁ జెప్పి । తోరపు ధృతి ద్రోణుతోఁ దలపడిన,
గుహ జామదగ్న్యుల ఘోరాజివోలె । మహితరణంబయ్యె మఱియు వారలకు.
బాగైన జగమెల్ల బాణమయంబు । గాఁగలదో యని కంపించె బ్రహ్మ.
బాణానిలంబులుఁ బ్రాణానిలములు । త్రాణదప్పఁ గలంచె దాయాదిభంగి.
హరిముద్దుతమ్ముఁ డన్నంతకుఁ గలిగి । హరిసూను శిష్యుఁ డన్నంతకుఁ గలిగి
శైనేయుఁ డేయ, నాచార్యుఁ డయ్యేట్లు । రానీఁడు కూల్చు మార్గణవహ్నిఁ గాల్చు.

అంత ద్రోణునిచాప మతఁడు ఖండింప । నెంతయు వెస ద్రోణుఁ డితరచాపమ్ము
నమ్మెయి సంధింప నదియు ఖండించె; । ఇమ్మాడ్కి ద్రోణు విండ్లిలఁ బెక్కు విఱిగె
మేలని ద్రోణుండు మెచ్చె సైనేయు; । ఆలావు గొనియాడి రమరులు మింట.
అంత నొండొకవింట నాగ్నేయశరము । కౌంతేయ హితునిపైఁ గలశజుఁ డేయ
వైరులయార్పులు వదల సాత్యకియు । వారుణాస్త్రంబున వారించె దాని.
ఆలోన గురునిది క్కఖిల కౌరవులు । చాల సాత్యకిదిక్కు సకలపాండవులుఁ
గైకొని యెక్కినఁ గల్పాంత జలద । భీకరసమర సంభృతమయ్యె రణము.
అటఁ గ్రీడి రవివంక నరిసేనవంకఁ । జిట చిటఁ జూచుచుఁ జేవేగిరమునఁ
బఱపైన తనతేరు పాఱెడుపాటి । తెఱపిగా వ్యూహంబు ద్రెంచుచుఁ జొరఁగ

## విందానువిందు లర్జునుచే మృతిఁ బొందుట

పీకునఁ బోనీక విందానువిందు । లేకరథస్థులై యేతెంచి యార్చి
చీఁకటిదిక్కులఁ జేర నేయుటయు । (నాఁకటఁ గినియు సింహమువోలెఁ గ్రీడి)
విందుని ధనువు గోవిందుఁడు మెచ్చఁ । బిందికలొనరించి భీతిగా మఱియు
ననువిందు నవల మూర్ఛాయత్తుఁ జేయ, । ధనువు వేఱొక్కటి దాల్చి విందుండు
రథచిత్రగతుల మార్గణచిత్రగతులఁ । బృథసూనుఁ జిక్కులఁ బెట్టఁ జూచినను
విందునిఁ జెనక నావిందు నర్జునుఁడు । క్రందైన బాహుయుగ్మమునకుఁ బాపి
తురగ కేతన సారథులతోడ వాని । శిరముఁ ద్రుంచినమాత్రఁ జెడక యయ్యసుర
యను విందుతనువున హత్తెనో యనఁగఁ । దనమూర్ఛఁ దెలిసి యాతఁడు నిట్టనిల్గి
యన్నఁగానక దుఃఖమాత్మలో ప్రగ్గ । యున్నతగద గొని యుర్వికి దాఁటి
వడిఁ గ్రీడిశరముల వాఁడితాఁకునకు । జడియక పఱతెంచి శౌరినేసినను,
అన్న[1]దమ్ములమేల మనునట్లు వాని । నెన్నడు మొకకోల నెఱిఁ ద్రెవ్వనేసి,
చిందంబు వట్టినఁ, జెదరక వాని । క్రందైనబలములు గాంఢీవధరునిఁ
దాఁకె, నింతియకాని తనువుతో నొకఁడుఁ । బోక క్రీడిశరాగ్నిఁ బొడిపొడి యయ్యె.
మఱియుఁ గవ్వడి పూర్వమర్యాద రిపుల । నఱుకుచు నవధిగానక వచ్చుచోట
నాతని [2]యలవు రథ్యంబుల యలవు । చేతప్పి రిపులు సుస్థితినున్న యలవు

1. దమ్ములు మేలు యనెడువాని. 2. యెలవు.(మూ).

జయమని కౌరవసైన్యంబు లార్చి । దయలేక యేకయత్నంబునం బెనఁగ,
శ్వేతవాహనుఁడు వారిఁ జెరికిఁ గొనక । పీతాంబరుచేఁ జూచి ప్రియమొప్పఁ బలికె:
"అలుగులు పాతుకొన్నవి శరీరమున । నిలుపు మశ్వములు విప్పు నీ తురంగముల ;
తాఁకనీ రిపు లేను ధనువు నున్నార । నూఁకొని హయముల నూల్కొల్పి తెమ్ము.
పని తమకంబున బంటు నేమఱిన । జనుల కాపను లేల సాధ్యమౌ?" ననిన
హరి యట్లకాకని యరదంబు డిగ్గి । హయుల యశ్వముల విడ్వ, నతిసాహసమున
ధరకుఁ గ్రీడియు డిగ్గి ధనువు సారించి । యరిసేన శరముల నాఁగఁ జొచ్చినను,
దేఱిన యొక్కని తెఱవిఁ బెక్కండ్రు । దూఱుచు నీదు యోధులు మహోగ్రమునఁ
బిడుగును బాముఁను బెనఁచినట్లగుచు । మృడుచూపుఁ గార్చిచ్చు మెదచినట్లగుచు
గరళము మృత్యువుఁ గడఁగినట్లగుచుఁ । గరమార్చి ముట్టడగాఁ జుట్టుముట్ట
హరుని వ్రేసిన ధీరుఁ డది లెక్కగొనక । శరములు దీర్చిన చాపంబు ద్రిప్పి
పొనర నుత్తర బొమ్మపొత్తిక లోలువ । ననిచి కౌరవుల నాఁ డాఁగినయట్లు,
నాకితోఁటఁ గృశాను నమలంగఁ బెట్టి । యాకడ సురల నాఁ డాఁగినయట్లు,
బాణబీరంబునఁ బరుల బాణముల । రేణురేణువు లొనరించుచుఁ బరఁగి
రథశకలములు వారణశకలములు । ప్రధనంబులో వాజిభటశకలములుఁ
దొడవుల యినుము నెత్తురుల వాఁగులును । నడుకొన నఖిలసేనల నివ్వారించె.
అంత జిష్ణుని విష్ణుఁ డల్లనఁ గదిసి: । "కౌంతేయ, యివె తురంగములును దేరు ;
నలుగులు వెఱికితి ననువుచేసితిని ; । జలములఁ ద్రావక చాలఁ బన్నడవు ;
అలసె నేఁటి ప్రయాస మది యెంతలేదు! । కలదొకో యుదక? మిక్కడ నెట్లుగలుగు?
అడరున నింతసేపైనది చాలు ; । ముడుతునే మెడ?" లన్న మురవైరిఁ జూచి
కవ్వడి: "మునుపకు గలిగింతు జలము ; । త్రిప్పనే మనకివి తృషనున్నఁ బనులు!
అవధాన మెన్నఁటి! కనువులెన్నఁటికి! । నవభంగిఁ జూడుమీ నన్నింత." యనుచు
నుర్విపైఁ గొలనుగా నొక దివ్యశరము । సర్వజ్ఞుఁ డాయాజి జరపుచు నేసి
దానికి రక్షణార్థము శస్త్రశాల । గా నేయ నాశ్చర్యకలితులై సురలు
'ఏ యాజిఁ గంటిమే యీనేర్పు!' లనుచు । నాయర్జునుని గొనియాడిరి ప్రీతి.
అట్టి బీభత్సు రౌద్రాద్భుతంబులకు । నెట్టనఁ బొగడిరి నీవారు నతని.
అంత నారాయణుం డఱనవ్వుతోడ । నింతవానికిఁ గదా నేవత్తు ననుచుఁ
దనువులు నిమిరి రథ్యముల నచ్చటికిఁ । జననిచ్చి దప్పివో జలముఁ ద్రావించి

నీరార్చి యప్పుడ న్నెలవుల మొలచు । పూరి దిన్పించి నేర్పునఁ గొనితెచ్చి
నిజయత్నహానికి నీసేన వగవ । గజపురీశ్వర, యొయ్యఁగట్టెఁ దేరునకు.
అతఁ డిట్లు గట్టి రథారూఢుఁడైన । ధృతి నర్జునుఁడును నత్తేరికిఁ బాఱి
యుదయాద్రి రవియెక్క నొదిఁగి చీకట్లు । కదలున ట్లరులు డగ్గఱమికి నగుచుఁ
జాతురి నిలుచుచో సర్వాంకుఁ డివల । నాతడవునఁ గ్రీడి నటఁ గూడవచ్చి
కదనంబు సేయఁ బొంకంబైన చోటు । వెదకుచుఁ బ్రచ్ఛన్న వృత్తిమై నడచె.
ఇరువురు కృష్ణులు నిట్లు తేరెక్కి । కరమార్భటముగ శంఖములు పూరించి
'వ్రాలెఁగదా ప్రొద్దు వలసిసం' తనుచుఁ । ద్రోలిరి సైంధవు త్రోవకై రథము.
అప్పుడు "సిగ్గుగదా! యింక మనకు । నిప్పార్థుఁ దాఁకి జయించెద మనుట;
భూవరునకుఁ బ్రొద్దుపోదు సైంధవునిఁ । గావ నెక్కడివాఁడు! కదిసెఁ గార్యంబు;
వేఁడి రథంబిట్లు విడిచిన మనల । నాఁడువారినిజేసి యనిఁ బేర్చువాఁడు.
అప్పుడులేని శౌర్యము మనకింక । నెప్పుడు రానేర్చు నిలను శుద్ధముగ?
ఓసరించియు వీని నొగిఁజూత." మనుచుఁ బాసిరి కొంద అప్పటికి నీ భటులు.
కొందఱు రాజులు 'కురురాజు వినిన । నిందయా' నని క్రీడి నెట్టోర్చి తాఁకి
శివుఁడుచుట్టినఁ బోవు జీవరాసులకు । వివరింప నరిదైరి విజయాస్త్రములను.
కొంద ఱాసైంధవు కూటుగా నుండి । యందంద తలయెత్తి యర్జునుఁ జూచి,
"వాఁడి చూపులఁ గ్రీడి వాఁడెపో వచ్చె । లేఁడయ్యె నొకఁడు నిల్పినవాఁడు వీని.
కుంభజభోజులు కూర్కిరో వినము; । కాంభోజు శరములఁ గ్రాఁగెనో వినము;
విందానువిందులు వెండియు నృపతు । లెంద ఱీల్గిరో! కాన మిదె వచ్చెఁ గ్రీడి;
మనమును మునుమైతిమా! వీని." యనుచు । మనమునఁ గలఁగుచో మాధవనరులు
అలయక కొంతదవ్వటు పోయిపోయి । తలయెత్తి కనిరి సైంధవుఁ దోటివారి.
కని పల్కి: "రక్కటా! కర్ణునిఁ గర్ణ । తనయు శల్యుని సోమదత్తునిఁ గృపుని
ద్రోణిని నమ్మి సైంధవుఁడున్నవాఁడు; । ప్రాణి గానఁడుగదా! ప్రాణభయంబు.
వీరేల హారి హార విధు లడ్డపడిన । వైరి సాధింపక వదలము మనము."

### కవచధారణంబున దుర్యోధనుఁ డర్జునుఁ దలపడుట

అని యిట్లు సకలసైన్యము విన నాడి । చనుదేర నడ్డమై సర్పకేతనుఁడు
ఔషధబలమున నహితుండికుండు । రోషితభోగి మార్కొనిన నిశ్శంకఁ

కవచబలంబునఁ గడియవచ్చుటయు । దివిజేంద్రసుతుఁ బల్కె దేవకీసుతుఁడు :
"పరునిఁ జూడుము బల్లి పాలలోఁబడిన । కరణి నిరుకునఁ జిక్కెఁ గార్యగర్వమున.
మూలము మీ బన్నములకెల్ల వీఁడు ; । శూలము భరతవంశముకెల్ల వీఁడు.
ఎక్కడి పవనజుఁ! డెక్కడి ప్రతిన! । చక్కాడు సుతశోక శాంతిగా వీని.
వీఁడుగదా పెట్టె విషముతోఁ గూడు! । వీఁడుగదా యిండ్లు వెదకి కాల్పించె!
వీఁడుగదా యాడె వెడఁగు జూదంబు! । వీఁడుగదా త్రోచె విపినాద్రి మిమ్ము!
అట్టివాఁ డబ్బిన నక్కటా! శిరము । గొట్టవు నీ మొార్పు కూలనా! యిచట!
సైంధవుఁ జంపుట శక్య మెట్లైన; । సైంధవుఁ డాభీతిఁ జనినను జయము.
అనిన వాసవి 'యట్ల యయ్యెడుఁ గాక । చననిమ్ము వీనిపై చక్క రథంబు.
వెనుక సత్త్వము రాక వీఁడట్లు రాఁడు; । కనుఁగొంద మదియు నొక్కొక్కచో."యనిన

... ... ... ... । ... ... ... ...

కమతముగతి జన్మకారిన్యవృత్తిఁ । దెములనిపతి వారి ధృతిఁ జూచి పలికె:
"ఒక్కింత నిల్వుఁడీ యోకృష్ణులార! । చిక్కితిరిదె మిమ్ముఁ జెండాడువాఁడ."
అనిపల్కె మనమూఁక కాశ్చర్యమెసఁగ । జనపతి వారి నస్త్రపుసోన ముంపఁ
'గప్పపైకొని యిట్లు కఱచునో!' యనుచు । నప్పార్థుఁ డతని సాయకపంక్తి నఱకి
పోయెఁ గౌరవపతి పోయె నన్నాటి । ధీయుక్తి నతఁడు పృథ్వీశు నేయంగ,
నిడు జంగ ఱాతిపై నిర్ఘరాంబువులు । పడినట్లు మిడిసి యబ్బాణజాలములు
అగ్నిరోముని భీషణాకృతి వోలె । నగ్నికణంబుల యాకృతి నిగిడి
యవివచ్చి క్రమ్మఱ నాత్మదేహమునఁ । దవులుచోఁ, నెఱఁగి మాధవుఁ జూచి నరుఁడు :
"కవచధారణమునఁ గల దొకవిద్య; । ధ్రువమతి నితనికి ద్రోణుఁ డీ నోవు.
గోత్రారికిని నాకు గురునకుఁ గాని । ధాత్రి నన్యుల కిది తలపోయ లేదు.
ఏమాయ నితఁడున్న నేమాయె! నతని । మేమలు వేఁద్రుంతు మెత్తునే!" యనుచు
నది త్రుంచుమున్నె గోత్రారిచేఁ గన్న । ప్రదరంబు తొడుగుచోఁ, బరికించి యవల
తెగ లోనువెడలి యేతేరకమున్న । తెగనేసె ద్రౌణి యా తీవ్రసాయకము.
అట్టియు మఱియును నమ్మహాశరము । పట్ట నూహించిన పార్థుండు మాని
వింటిలావున యుక్తి వెరవున దీని । గెంట నేసెద నని కృతముష్టి నేసె.
నీ సుతుఁడును గృష్ణు నిశితాస్త్రయుగళి । నా సవ్యసాచి బాణాష్టక యుగళి
సైంధవధ్వజముల శరసప్తయుగళి । సైంధవు నాఁకగా సంధిల్ల నాటి

యింద్రజాస్త్రంబుల నెడనెడఁ దునిమె. । నింద్రజుఁ డతని తేరిల ద్రొళ్లనేసి
కరతలసంధులు కాడఁ గాండములు । వర శక్తిఁ బఱప న వ్వసుమతీపతియు
నాదట మేనెల్ల నలుగులు నాటి । వేదనయంతటి విధము జనింపఁ
'గపటపు జోడిచ్చెఁ గలశసంభవుఁడు । రిపుఁడుగదా విదారించె న' న్ననుచు
(నొండొక మైమఱు వోసవఁగ దాల్ప । భండనాధిపులు కవ్వడిఁ జుట్టుముట్టి)
యెదుట నేలికయుండ నెంతయుఁ బొంగి । పదిమొగంబులఁ బర్వి పార్థు నేయుటయుఁ,
జెలఁగి తేరు సహస్ర శీర్షుండు వెలుప । మొలఁగి యోధుఁడు నట్టిమెండు గైకొనక
కాళి కరాళ హుంకారముల్ వోని । వాలిక తూపులవాన ముంచుటయు
పీట తొటంబులై విఱిగెడు రథము, । లోటి పీరణములై యొరగు నేనుఁగులు,
నడరి [1]యోతప్రోతమై త్రెళ్ళు హరులుఁ, । బడుగు పేకయుఁ బోలెఁ బడు కాలుబలము,
లల కేలు కాలు మధ్యము నేరుపడక । యిలకు వ్రాలెడు ధారుణీశులుఁ గలిగి
సమరోర్వి మాంనపచన [2]పాత్రగర్భ । సమరేఖమై పార్థుశరవహ్ని [3]నుడికె.
అటు వెచ్చమయ్యె సైన్యము దైన్యమేది । పటులీల గాండీవపాణిఁ బోనీక
మదమున గిరిఁ బ్రాఁకు మత్తగజంబుఁ । బొదివెడు భూరుహంబులగుంపు వోలె
బలువునఁ బెనఁగ నప్పాండవుఁ డాత్మ । నలిననాభునిమాట నాటుటఁ జేసి
పతినింతఁ జంపక ప్రతినరాదనుచు । నతనికి నడచుచో నానేనలెల్ల
విచ్చె; నప్పుడు రాజు విముఖతఁ బొఱఁ । జచ్చెఁ బొమ్మని మ్రోసెఁ జద; లట్లుమ్రోయఁ

కర్ణాదిరథికు లాకృష్ణుడి నర్జునుఁ బొదువుట

దునిసిన కవచ మద్దుర్యోధనునకు । నెనిమిది రూపులై యేతెంచె ననఁగ
మెఱుఁగులు తళుకొత్తు మృగరాజు సిడము । మెఱయఁగయ్యములందు మేటిద్రోణియును,
ఉడురాజు సరివోలుచున్న వారణము । పడగతో నాహవప్రౌఢిఁ గర్ణుండు,
నలిఁ జిత్రవర్ణపు నమిలిపతాక । యలరు మహాక్రోధి యతనిసూనుఁడును,
వెలుఁగున రవిఁబోలు వృషభకేతనము । వెలయ ధనుర్వేదవేది కృపుండు,
శ్రీలక్ష్మిఁ బొడవైన [4]సీతకేతనము । గ్రాల బాహాబలగర్వి శల్యుండు,
చెలువైన నవరత్న సింధురధ్వజము । వెలుఁగొందు రణకళావేది శలుండు,

---

1. యోధవ్రాతలై, 2. మాంత్ర. 3. గురిసె. 4. శిరము. (మూ)

నడుమవీధి మాణిక్య యూపపుఁ జడగ । పొడవున రిపుహారి భూరిశ్రవుండు,
[1]రాజతమైన వరాహ కేతనము । రాజిల్ల సమరభైరవుఁడు సైంధవుఁడు
నిజనిజ సేనతో నృపునకు నొదవి । విజయుపై నాటోపవృత్తి నెక్కినను
ఆ వీరసైన్యంబు లట్టిట్టు పడఁగ । దేవదత్తంబొత్తి దేవేంద్రసుతుఁడు
అఱువంటకోలల నందఱఁ బొదివి । విఱిచె శల్యునివిల్లు వెడఁదతూపునను.
అంత నశ్వత్థామ యందఱఁ గడచి । కౌంతేయు నుగ్రమార్గణ పంచకమునఁ
గమలాక్షు నాఱు వ్రేకపు నారసముల । విమలాశ్వములఁ బది వేఁడిబాణములఁ
బురహరుగతి భూతములు గొల్వనున్న । హరి కేతనము పదాఱమ్ములనేసె.
అతనికి మిగిలి రాధాత్మజుఁడస్త్ర । శతమున గాండీవిచాపదండమును
శరశతద్వయిఁ గ్రీడి జతనపు జోడు । శరలక్ష నరు తేరు సరిగ్రుచ్చి యార్చె.
ఆ యిరువుర కెక్కుడై కృపాచార్యుఁ । డాయత శరవృష్టి నర్జు నాస్త్రములు
నారాచకోటి నన్నరు కిరీటంబు । ఘోరభల్లంబుల గొడుగులఁ బొదివె.
వీరుఁడందఱికన్న వృషసేనుఁడలరి । దారుణాస్త్రముల నింద్రజు శింజినియును
శూలపాతములఁ గృష్ణుని కత్తళంబు । వాలువాట్లను [2]నరు శావాంయుగమును
భూరి చక్రంబుల బోరన గదల । శౌరివర్మంబు సీసకమును నొంచె.
భూరిశ్రవుండు నప్పుడు రథరథ్య । సారథిరథికులు చాపంబులనక
యోలి నిన్నియుఁ గూడి యొకబాణనగముఁ । బోల నొక్కటనేసె భుజసంభ్రమమున.
శల్యుఁ డార్పురశస్త్రచండిమకంటె । నెల్ల తామూరేఁడు నెక్కుడై నట్లు
నలి నరనారాయణప్రశ యూగ్ని । కలదు లేదనిపించెఁ గాండవర్షమున.
శల్యుండు నొండొకచాపంబు సమర । లౌల్యమేర్పడఁబూని లావునఁగదిసి
ఘోరమృత్యువు వేఁడి కోలలఁ బోని । నారాచములఁ ద్రుంచె నరు నరసఖుని.
వీరుఁడు తానయ్యు విజయుభయమున । వీరిమాటునఁ దూఱి వెనసైంధవుండు
మొగిళుల మాటున మొగి మేఘనాథుఁ । డొగి నేసినట్లేసె హుంకృతి నరుని.
తోడుగల్గిన యాస దుర్యోధనుండు । క్రీడినేసె ననేక కృత్రిమాస్త్రముల.
సేనలు నప్పుడేసిరి కట్టతెగినఁ । బూనివచ్చు ప్రవాహమును బోలె వాని.
నిర్జరులంత నా నిండు కోల్తలకు । నర్జునుఁ డగపడునని యెన్నుకొనిరి.

1. రాజిత. 2. నక్షవద్రియుగములును. 3. చర్మంబు. (మా)

ఏనును [1]మతిసెడి యింద్రనందనున । కైన యాపదయని యధిప, చింతిలితి.
అప్పుడు దరహాస మాననాబ్జమునఁ । జిప్పిల్లఁ బార్థుఁ డశేషయోధులకుఁ
గుత్తుకబంటియై గొడుగులు విండ్లు । నెత్తినపడగలు నిరుసులు హరులు
సూతులు రథములు జోళ్ళాదిగాఁగ । శాతసాయక సహస్రములఁ గప్పుచును
నెఱసి యెల్లెడ నూర్మినికరంబు తాఁకఁ । దఱగని జలధిమధ్యము కొండవోలె,
నురుఁగులోఁ జిక్కని నులివేఁడినెత్తు । రురల వారలమేను లోలిఁ జించుచును
దనబారి నిందఱుఁ దగులుట దోఁపఁ, । దన తెల్వి యితరులదైన్య మేర్పడఁగఁ,
దనువులు మఱచి యిందఱు వెనుదివియఁ, । దనియ దివ్యాస్త్రసంతతిఁ బెచ్చుపెరిగి,
నిలువరించియు వైరి నిజదృష్టి వీధి । [2]నిలుచుట చింతించి నెఱి సంతసించి
వానిపైఁ బఱపిన వాఁడితూపులును । మానవాధిప, నూఱుమాత్రము గలవు.
విఱిగె శల్యునివిల్లు వేఁడినయట్లు; । నుఱుమయ్యె దుర్యోధనుని పోటుజోక;
జలజనాభుఁడు నిజశంఖ మొత్తుటయు । నలుగుల నరికట్టె నఖిలసైన్యముల;
విముఖత కడమగా విఱిగియు యోధు । లమరేంద్రసుతునేసి రాజిలో." ననిన
వైచిత్రిఁ గొనియాడి వైచిత్రవీర్యుఁ: । "డోచెల్ల! సంజయ, యొప్పెఁ గార్యంబు;
విడువఁడు సుతుఁడు తా విజయ జయాశ; । వడఁకెద నక్కటా! వాని నే మందు!
ఈవు చెప్పిన యట్ల యిది నాయుపేక్ష; । యేవెంట దైవాజ్ఞ నేమనవచ్చు?
అనుజున కాసరా యరుదెంచు ధర్మ । తనయుఁడు దొరలు నెంతటఁ జొచ్చి?" రనిన
ననఘుఁడాతనికి నిట్లని చెప్పఁ దొడఁగె । నని ముని జనమేజయక్షితిపతికిఁ
జెప్పినగతిఁ జెప్పఁ జెలఁగి యమ్మీఁద । నెప్పాటఁ గథ చెల్లె నెఱిఁగింపు, మనిన
భానుకులాంభోధి పావన చంద్ర! । భానుకోటి నిజప్రభా భాసమాన!
కరుణా కటాక్ష వీక్షణ! దయాలోల! । సురరాజనుత! మహాసురరాజవర్య!
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరి సత్పుత్త్ర । మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
విరచిత ద్రోణాఖ్య విపుల పర్వమున । నరుదుమీఱఁగఁ దృతీయాశ్వాస మయ్యె.

---

1. మదినిడి. 2. నిలువుము. (మూ)

# చతుర్థాశ్వాసము



శ్రీవైష్ణవాధార! స్థిరకృపాపూర! । [1]పాలితమునిసీమ! పరమాత్మ! రామ!
బ్రాఁతి నంబుధిఁగట్టి పతిదైత్యుఁగొట్టి । సీతఁ దెచ్చిన సాహసీ! చిత్తగింపు.
అక్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె:

## ధర్మరాజు ద్రోణునితో యుద్ధమొనర్చి యోడిపోవుట

పలికె సంజయుఁ: "డిటుఁ బాండవాగ్రజుని । బలము ద్రోణునిమీఁదఁ బఱతేరఁ [2]గదలి
పైఁబడఁ గడఁగ నిల్వఁగఁబోవు దిగిచి । వేఁబోవు నతఁడు రువ్వినఁ బోవు దిగిచి(?)
యాయన్వ గాదని యంతఁ దూర్యములు । మ్రోయ భీమాదులు మొగిఁగూడి నిగిడి
బోరన నెక్కిన, భూపాల! యపుడు । ఘోరరణంబయ్యెఁ గురుపాండవులకు.
తగ నందు సహదేవుఁ దాఁకి దుర్ముఖుఁడు । నిగిడి పోరాడియు నిలువకే పాఱె.
నకులునిఁ గర్ణుండు నవభంగిఁ దాఁకి । యొకముహూర్తము నిల్చి యుసిఁగె నవ్వెనుక.
[3]శీఘ్రబాహునిరాఘి శిసిపౌత్రుఁ దాఁకి । [4]వ్యాఘ్రదత్తుఁడు గూలె ద్రయ్యలై ధరణి.
దొరకొని బకవైరితో నలంబుసుఁడు । దురమొనరించి యోధులు నవ్వఁ బాఱె.
శరశక్తి మాగధ సహదేవుఁ దాఁకి । నిరమిత్రుఁడను రాజు నిశ్శేషుఁ డయ్యె.
చనుదెంచి చనుదెంచి శల్యుండు ధర్మ । తనయుతోఁ బోరాడి తగ నేఁగుచుండె.
ఒకమాఱు శలుఁడు శల్యునియట్ల వచ్చి । యకరుణ ద్రౌపదేయులమీఁదఁ దాఁకి
మరలవారల ధనుర్మధ్య నిర్ముక్త । శరముఖ ఘోరాగ్నిశలభమై క్రాఁగె.
అంత ధర్మజుఁ దాఁకి యాచార్యుఁ డతనిఁ । బంతంబుతో ముట్టి బలిమిమైఁ బెనఁగ
గురునివక్షము దూఱఁ గుశలత మీఱ । నిరువది బాణంబులేసె నానృపుఁడు.
శరపంచవింశతి చాల నొప్పెనఁగ । గురుఁడును నేసె నక్కువలయేశ్వరుని.
ఏసి వెండియు నన్నరేశు విల్విఱిచి । యోనరింపక కప్పె నుగ్రాస్త్రవృష్టి.
'అప్పుడు తగులునో! యటుగాక తెగునో! । తప్ప దీనృపుఁ' డని [5]తలఁచె నీబలము.
మిసిమింతుఁడునుగాక మేదినీపతియు । వెస వేఱె విలుదాల్చి విప్పైన[6]వృష్టి

1. పావన. 2. గణఁగి. 3. సేగ్ర. 4. న్యగ్ర. 5. తగవేల. 6. దృష్టి. (మూ)

విప్పినఁ, గోపించి విభునిపై ద్రోణుఁ । డప్పుడు బ్రహ్మాస్త్ర మరిఁబోసి యేసె.
నతఁడును నలిగి బ్రహ్మాస్త్రంబులేయ । హతములై యవి వ్రాలె నన్యోన్యహతుల.
గదవైచె నప్పు డక్కాంతేయు ద్రోణుఁ ; । డది తునియఁగ నేసె నతఁ డుగ్రశక్తి.
గురుఁడంతఁబోక యక్కువలయేశ్వరుని । హరుల సూతునిఁ ద్రుంచి యట విల్లుదునుమ
భయమంది నృపుఁడూర్ధ్వబాహుఁడై నిలువ । లయముఁబొందింపఁ జాలక సైన్యపతియు
నాతనిచుట్టు సైన్యముఁ దైన్యపఱుపఁ । జాతురి నతఁడెక్కె సహదేవురథము.

## అలంబుసుఁడు ఘటోత్కచునితో యుద్ధము సేయుట

అడరి యాదెసచూచి హైడింబుఁ డంతఁ । దొడిఁబడ గురుఁ దేరితో ద్రుంగఁబోవఁ
బోకుపోకని యలంబుసుఁ డార్చి యతని । వీఁకఁ దాఁకినఁ జూడ వెఱఁగయ్యె రణము.
కనలి యిర్వురువైచు గదలు శక్తులును । దునియలై చెదరి యోధుల వచ్చి తాఁకె.
శరతరంగోత్తుంగ సంఘర్షణముల । నరుణబింబముఁ దాఁకె నయ్యెక్కుధూళి.
జేగురుఁ గాల్వల క్షితి [1]ధర యుగము । లాగైనగంట్లఁ గీలాలముల్ దొరుగ
... ... ... ... ... । ... ... ... ... ...
అందు నలంబుసుఁ డందంద పాండు । నందన సుతు నేసె నలిఁదేరు విఱుగ.
అసిఁగొని మింటికా యసుర దాఁటుటయు । వెసఘటోత్కచుఁ డంత వెంటనే దాఁటె.
అసురు లచ్చట మొత్తులాడి భూస్థలికి । వెసడిగ్గి గదలతో వెండియు నెగసి
వారివాహంబులు వాయువశమునఁ । బోరెడుగతిఁ బోరి [2]పొలివోకవచ్చి
యొక్కఁడొక్కనిఁ బట్టి యురుసత్త్వ మహిమ । నొక్కట నెసఁగుచు నుర్విపై వ్రాలి
మల్లయుద్ధము సేయ మఱి యలంబుసుని । ద్రెళ్ళవైచి యురంబు ధృతి నెక్కివాఁడు
మొగము మోఁచేతుల మోఁకాళ్ళఁ బొడువఁ । బొగడి రప్పుడు పాండుపుత్త్రులప్పుత్త్రు.
ఆ సమయంబున నాచార్యుఁ డంత । భాసురంబుగఁ గోపభరితుఁడై తాఁకఁ
గినిసి సాత్యకి యడ్డగించుచో నతనిఁ । *దన పేరుగాఁ ద్రుంచు త ... ...
... ... ... ... ... । ... ... ... ... ...
... ... ఉగ్రగ్రహంబు । మరలించుగతి వాని మరలించి యతఁడు

1. ధారయుగళ. 2. వోవక. (మా)

* ఈ పట్టున తాటాకు కుడిపైపు సగముముక్క లేదు.

ఇతని కీతఁడె యోప్పు; నితనికి నితఁడె। ... ... ... ... ...
... ... ... ... ...। ... ... ణుండును ...
శాతబాణములు పింజలబంటి దిగను। అతని నాటింప నతఁడేప్పువట్టి
... ... ... ... ...। ... ... ... ...
కౌంతేయులకు నవగాహింపలేక। ... ... ... ... ...
రౌద్రముద్రా విద్ధ రణ గర్వమహిమ। రుద్రుఁడై పెనఁగి పార్థుఁడు మ ...
... ... ... ... ...। ... ... ... ... ...
... ... ... లు లంచు। పంచవింశతిసంఖ్య పడిరి కేకయులు.
తొవకి స ప్తతి సంఖ్య తూలిరి మాత్స్య। లవనీశ, మఱి ... ...
... ... ... ... ...। ... ... ... ...

## ధర్మరాజు సాత్యకినర్జునునకుఁ దోడ్పడఁ బొమ్మని ప్రార్థించుట

... ... శైనేయుఁ। గనుఁగొని తమకంబు గానరాఁ బలికె
చెన్ను మీఱఁగ హరి శంఖరావంబు (?)। క్రన్నన వినరా ... ...
... ... ... ... ...। ... ... ... ...
... ... డ్డి కంటికిఁ బోయి। పడఁడుగదా వైరి భటుల కొక్కఁడును!
వాడెఁడుఁ జిత్తంబు వడఁకెడు నొడలు। తో ... ... ... ... ...
... ... ... ... ...। ... ... ... ... ...
... ... దు శిష్యుఁడ ననుకొందు। పోరామి గావవె పోయి నీగురుని.
అతనిఁ గాచుట నన్ను హరి భీమ ...। ... ... ... ... ...
... ... ... ... । ... ... ... ...
... ... ... కుండు। పోదువఁ బోరుదు రొంటిఁ బోయె నాతమ్ముఁ
డోడుపవే మిగుల అంతోదవె నచ్చోట.। ... ... ... ...
... ... ... ...। అతఁడిట్టి ప్రతిజ్ఞ యాడుకొన్నాఁడు."
అని పెక్కుభంగుల నతఁడు ప్రార్థింప। శిని పౌత్రుఁ డంజలిచేసి ... ...
... ... ... ... ...। ... ... ... ... ...
... ... ... దనియు। నిలిపి పోయెఁ గిరీటి నినుగావ నన్ను.

రాజరక్షయు సింధురాజ శిక్షయును । ఆజి నేఁ డొకటని హరి విన నాడె.
పొమ్మన్నఁ బోయెదఁ బోలేక కాదు । చిమ్మెద రిపుసేనఁ జీకాకు పడఁగ.
ఇచ్చోట నీకొక యిమ్ము దప్పెనఁ । జచ్చియు వృథగాదె సైంధవుఁడచట!"
అనిన ధర్మతనూజుఁ డతనితో మఱియు : । "ననుగావ యోధులున్నా రెందఱైన;
ద్రుపదుండు ద్రుపదపుత్త్రుఁడు విరాటాది । నృపులు సామాన్యులే! నిన్ బోలువారు.
హరిసూతి గలిగిన నందఱుఁ గలరు । చొరుమువ్యూహము వాయుసుతుఁడుతోడుగను.
ఇరువురుఁ బోకున్న నేనమ్మ నతనిఁ । బరమార్థ." మనుటయు భయమంది యతఁడు:
"ఏనేఁగ నితఁడేల? యిచటికి వలయుఁ; । గాన నిర్వురుఁ బోవఁ గడు దూఱు క్రీడి.
ఎంతటిపనియిది! యేల చింతిల్ల! । నంతకు నన్నంచి యటు చూడు." మనిన
నాతని కార్య శౌర్యములకా నృపతి । కౌతుకితాత్ముఁడై కడుఁ బ్రయత్నమున
సారథి కళనంబు జవనాశ్వములకు । నీరును ఖాణంబు నియతిఁబెట్టించి
యావీరు మదిరామ[1]దాస్యునిఁ దలఁచి । దీవింప మ్రొక్కి యాధీరుండు గదలి
వులి లేడిగమిఁ జూచుపోల్కి నీసేనఁ । గలయఁజూచుచుఁ దూర్యకలకలంబెసఁగ
వలుదముత్యంబుల వడి [2]వజ్రసూచి । నెలకొన్నగతి నొడ్డు నెలవునఁ జొచ్చి,
చుక్కల బారులఁ జొరఁ బాఱు తోఁక । చుక్కపూఁపునఁ జొరఁ జూచి ధర్మజుఁడు
అతనికి సేన సహాయమ్మై పనుప । నతఁ డందుఁ గూడక యరిసేనఁజొచ్చి
శిరములు వ్రక్కలుచేసి చెండాడి, । యురముల వ్రయ్యల నూరుఖండములఁ
గుత్తుక తునకల ఘోరాజి జముని । కుత్తుక కడి సేయఁ, గోల్తల పడక
పస రాతి పాటునఁ బక్షులువోలె । వెస నీబలంబులు వీఁగఁ జొచ్చినను
'ఓడకుఁ డోడకుఁ డోసేనలార! । చూడుఁడు నన్నని చొరవచ్చి గురుఁడు
శైనేయుఁ దాఁకి రోషము మించ నంప । సోనముంప నతండు సుక్కక పలికె:

## సాత్యకి మొగ్గరంబుఁ బ్రవేశించుట

"యమసూతి పనుపున నాజి నేఁ జొచ్చి । యమరేంద్రసుతుఁ గాన నరుగుచున్నాఁడ;
నున్నవా రెఱుఁగఁగ యోధుల మిమ్ము । నెన్నవచ్చునె నాకు నేలికపనుపు.
పోనిమ్ము నీకిది పురుషార్థవేళ । నేనొంటిఁ జొచ్చిన నింత నేమయ్యె?"

1. మదాద్యుల. 2. వజ్రినూతి. (మా)

అనిన ద్రోణుఁడు వల్కు: "నార ! వానవిరుఁ । జనియె నీయట్లు తచ్చన మాటలాడి.
పోరాడి గురుఁ ద్రోచిపోయెదే!" యనిన । దాను కానజుఁడైన దనసూతుఁ బలికె:
"పోరాదు రణ [1]భీము భుజుఁ డీద్విజుండు ; । వారణ హయభట వ్రాతంబు మెండు;
తప్పఁ దొలంగి చొత్తము ; రాచవనులు । తప్పు నిశనితోడఁ దడవైన మనకు.
ఇదె బాహ్లికునిసేన, యిదె కర్ణుసేన, । అదె [2]దాక్షిణాత్య సైన్యము చక్కఁజూడు.
ఇంచిన శరశక్తి నింకొక్క వంక । చించుక చొత్తము చిమ్మనీ రథము."
అనిన వాఁ డట్లకా కని యంగసేన । మును మున్న చొచ్చుచో ముందఱనార్చి
కృతవర్మ మూఁట నాల్గింట నేడింట । నతని సూతు రథంబు హయముల నొంప,
మూట వక్షము చోటు మూట సాత్యకిని । గాటంపుఁ గోలలఁ గప్పె నజ్జోదు.
కప్పిన శైనేయు కార్ముకభంగ । మప్పురుషుఁడు చేసి యార్చె; నట్లార్వ
శక్తిఁ [3]గైకొని వాని సారథిఁ జంపి । ముక్తి వదాన్యు తమ్ముఁడు నొందు విల్లు
ధరియింప, భోజుఁ డాతని దిక్కుచొరకి । యరదంబునడుపు కార్యమువాఁడు నగుచుఁ
బవనజు ముఖమైన పార్థు వాహినికి । నవఘళించిన, ద్రోణుఁ డాకథ లెఱిఁగి
రాజార్హు నొక్కసారథిఁ దెచ్చియిచ్చి । భోజు సేనాముఖంబునకుఁ జాలించి,
నిలు పోకు నిలుమని నిలిపి శైనేయుఁ । జల మొప్పఁ దాఁకి భీషణమూర్తిఁ బెనఁగె.
అటఁ గృతవర్మని నపదుగాఁ దలఁచి । పటుగతిఁ బాండవభటు లార్చి యెక్కి
వెనుక ముందఱఁబర్వి విశిఖావశిష్ట । తనుని గా నేయ, నాతఁడు నుగ్రభంగి
ద్రుపదు నైదింట మాత్స్యుని బదేనింట । ద్రుపదాత్మజాతపుత్త్రులఁ బది పదిట
నవనవకముల సేనాని శిఖండి । నవతిఁ గేకయులను నాటించి యార్చి
చెల్లాక చెదరుగా సేనల నెల । భల్లాది శరపరంపర బిట్టువఱపి
మొనకు మూలము వీఁడు మూర్ఖుండటనుచు । ననిలజువైచె మూర్ఛాయత్తుఁగాఁగ.
అతఁడంత నమ్మూర్ఛ యల్లనఁ దెలిసి । గత [4]కృపఁ గెంజాయ కన్నులతోడ
శూలంబులైదు భోజుని మీఁదవైవ । వాలమ్ములైదేసి వాఁ డవి ద్రుంచి
సూతాశ్వ తనువులు జొత్తిల్లనేయ । నాతండు నతని విల్లసిఁ ద్రెవ్వనేసె.
వైచి వెండియు విల్లు వాఁడు ధరింప । నాచందమున నేసె నదియును ద్రెవ్వ.
ఈ చందమున భోజుఁడేయ బకారి । చూచి సేనలను భోజునిఁ గప్ప నతఁడు
పెల్లునెత్తురు చిమ్మఁ బెద్దకోపమున । విల్లు విప్పఁగఁ బోయి వేసె వాయుజుని.

---

1. భీల. 2. దక్షిణాఖ్య. 3. వాకిటి జోదు. 4. కృత. (మూ)

వేయంగ నెడసొచ్చి వీరు లాభోజుఁ । బాయ బిట్టేయ నార్భటము లాలించి
జగదేకవీరుండు సాత్యకి యపుడు: । "మగిడెదఁ గాక క్రమ్మఱ వత్తుఁ గాని;
వెనుక అంతయ్యెడు విభునకే కీడు । మొనసెనో యటుపోదు మునుమిటు పెట్టి."
యని ద్రోణుతోడి కయ్యంబు చాలించి । శినిపతి కృతవర్మ సేనకుఁ దిరిగి
యతనిఁ దాఁకఁగ నిష్ఠురారావ ఘోర । వితతాస్త్ర రణమయ్యె వెస నిర్వ్వరకును.
అందు వే రథ్యంబునంది భోజుఁడును । గొందలపడఁ జూచి కుంతిజు లలర
వీఁగుసేనలఁ దగ వీక్షించి చూచి । యాగర్వి మఱియు వ్యూహముఁజొచ్చెఁ; జొరఁగ
గురుఁడు మాఱ్కొనఁడయ్యెఁ; గుంతిజులపుడు । తరమిడి కృతవర్మ దాఁటివచ్చుటయు
వారట్లు రాఁజూచి వారించి గురుఁడు । నారాచవృష్టి వెన్కకు వీఁగఁ దోలి
కృతమతి నచ్చోటఁ గృతవర్మ నిలిపి । మతమొప్ప శైనేయు మఱియు వెన్దగిలి
వచ్చునంతకు మున్న వానితో నెదిరి । (చచ్చె ననిన్ జలసంధుఁ డన్ రాజు.)
సాత్యకి గురుఁ డంత జగదీశ, కినుక । నత్యుగ్రగతిఁ బోర నా సహాయమున
దుర్మ్ముఖ దుస్సహ దుశ్శాసనులును । దుర్మ్మర్షణుండును ధృతి వికర్ణుఁడును(?)
గౌరవపతియును గదిసి శైనేయు । ఘోరాస్త్రముల ముంప గురుఁ డదిచూచి
'వీరితో మాఱ్కొన వీరె చాలుదురు । సేనాముఖంబు నేఁ జేరెద' ననుచు
సాలె వెజ్జునుబోలెఁ జయ్యన మరల(?) । నాలంబు బలిసె సాత్యకి కౌరవులకు.
విశిఖసంఘట్టన విస్ఫులింగములు । దశదిశలకుఁ బాఱె ధరణి మ్రోయఁగను;
హుంకారముల కుర్వి యుఱ్ఱూఁత లూఁగె; । టంకారములకు వడంకె దిక్కరులు;
తొల్లి బాల్యంబునఁ దోయధిఁ దారు । చల్లులాడువిధంబు శరముల దోఁప.

... ... ... ... ... । ... ... ... ... ...

వీఁగె నప్పుడు సేన; వీరుబాణముల । వేఁగెను నీ పుత్త్రవితతి భూపాల!
విల్లు రెండుగఁ ద్రెవ్వి విరథుఁడై విభుఁడు । నొల్లనఁ బాఱె వేఱొకని తేరెక్క.
సేసలచ్చట జాఱి చెదర భోజుండు । శైనేయుతోడి యచ్చలమున మఱియు
నటఁబోయి తాఁకిన నట్టహాసమునఁ । బెటిలి సాత్యకి కోపభీషణాస్త్రములఁ
బింజలకోలఁది నింపినను భోజుండు । భంజించె నతనిచాపము భల్లధార.
విల్లట్లు దునుమ నవ్విభుఁడు వేఱొక్క । విల్లెత్తె నెడమీక [1]వెరవొప్ప నతఁడు

1. వేరొప్ప. (మూ).

గదతిప్పి భోజువక్షము దాఁకవైచి । యదలింప మూర్ఛితుఁడై వ్రాలె నతఁడు.
వ్రాలిన నదియు చావని నిర్ణయించి । యాలోన నతనిసైన్యము నొంచువెంట
వీటతాటంబుగా విశిఖంబులేసి । నాటిపోవఁగ, భోజనాథుఁడు తెలిసి
శ్రీకంట నతని వీక్షించుచు మరలి । భీకరగతిఁ దాఁకె భీమాదిభటుల."
అన విని వెఱఁగంది యాంబికేయుండు : । "శినివరుఁ డక్కటా ! చిక్కకచొచ్చెఁ
బతి తన్ను ననిచిన భక్తి ; నాతనికి । నతిమానుషంబైన యాలావు వచ్చె ;
మఱి యిందుఁగలిగిరే మరలించు యోధు ? । లెఱిఁగింపు సంజయా ! యేమిందు." ననిన
ఆ సంజయుఁడు చెప్పె నధిపతి కిట్లు : । " వాసుదేవానుజు వరశక్తి వినుము
ఒకవంక నీపుత్త్రు లొదుఁగులు వాఱ, । నొకవంకఁ గృతవర్మ యులికి యేతేర,
నొకవంక సాత్యకి యొద్దు వేదూఱ, । నకలంకచిత్తుఁడై యటఁ జాపగురుఁడు
పాండవశిష్యునిపజ్జ దాఁ బోయి । (భండన పాండిత్య పటిమ యేపారఁ
బూనిన కినుకతో బొమముడి వైచి) । శైనేయ, నిలుమని సంధించి పిలిచి
తూపులఁ గప్పినఁ దోఁ ద్రొటుపడక, । చాపాంతరము పూని సాత్యకి కడిమి
వేఁడి నారసమున వెచ్చని నెత్తు । రోడిగిల్లఁగ ద్రోణు నోడక యేసి
పడగయు గొడుగును భంజింప, గురుఁడు । పిడుగుల మొగిలు రొప్పినయట్లు రొప్పి
(చతురుఁడై నూతు మూర్ఛామగ్నుఁ జేసి) । యతని నెత్తుటనోలలాడ నేయుటయుఁ,
బటుబాణములఁ బట్టువడక సాత్యకియుఁ । (దటుకున సారథిత్వము తాన పూని
పొరిగొని యంబకంబులఁ బ్రయోగించి) । గురుసుతో గురుసూతు కుత్తుక దునిమి
(యతిరయంబున వాయు వచలంబుఁ ద్రోయు) । గతి వానిరథము వెన్కకుఁ బడనేయ
గురుఁడు నాతనిసూతుఁ గూల్పంగ నుండె । హరులు తేరు హరింప నది తప్పెఁగాని.
అట్లు సారథిలేని యరదంబు మరలఁ । [1]బట్టుగొల్పఁగలేమి భగ్నుఁడై గురుఁడు
ఈక్రోలఁది గెల్వరా దీక వని యదియు । పోకఁగాఁ బోవ, నప్పుడు మొవలెల్లఁ
గన్నది కన్నవంకల విచ్చె ; విచ్చి । మున్నిటికడకేఁగి మొదలి సేనాని
భీమాది భటులతోఁ బెనఁగుచు నుండె. । ఆమేటిదెసకుబ్బి యట సాత్యకియును
ద్రోణాస్త్రములఁ జాలఁ దూలిన నూతుఁ । బ్రాణభీతికిఁ బాపి పలికె నిట్లులమి :
'భీమార్జునుల లావు పిఱుఁదముందటను । నోమిత్ర, గలుగఁగా నొదుఁగ మెవ్వరికి.

1. భట్లు గొల్వఁగ. (మూ).

నేఁడు పార్థులమీఁది నెమ్మి నానేర్పు । వాఁడిమిఁ బ్రకటించువాఁడఁ గయ్యమున.
నాతేరు నడఁకక నడపుమీ నేఁడు; । సూత, చూతము నిన్ను శూరమధ్యమున.
బీభత్సుశరములఁ బీనుఁగుపెట్ట । లేభంగిఁ దఱచయ్యె నిటుచూడు మొదట.
అది నీకుఁ దెరువు రథ్యంబులఁ ద్రోలు । పోదపోద." మనుట నుప్పొంగి సూతుండు
"ఇక్కఁగా నీకాఁకకేఁ దేరు గడప । నెక్కుడివాఁడ! మున్నెఱుఁగ నిట్లగుట.
నను జూడు మట్లయ్యె నా విమానంబు । ఘనవీథిఁ దెచ్చినగతిఁ దేరు దెత్తు.
అదె గాండివము మ్రోఁత; యదె శంఖరవము; । నదె కిరీటము కాంతు లనతిదూరమున.
దండనాథాంబుధి దాఁటిన నీకు । వెండియు నడ్డమే వెస వత్తుగాక.
సురలు రెండవయింద్రసుతుఁడు నీఁడనుచుఁ । బరిగణింతురు నింగి బహుభంగి నిన్ను."

## సుదర్శనుఁ డనురాజు సాత్యకితోఁ దలపడి మడియుట

అనినఁ గౌతుకమెత్తి యనివార్యవృత్తిఁ । జను శినివరు సుదర్శనుఁ డనురాజు
తాఁకి పోరాడుచోఁ, ధనువుతో వాని । ద్రేఁకపుఁ గుత్తుక విదళించి యతఁడు
శాత్రవ దుర్నిరీక్ష ప్రతాపమున । [1]మిత్రుఁడై మాయచే మెయి మెయిఁ బోవఁ,
గైరాత బర్బర ఘన [2]శకమ్లేచ్ఛ । పారద యవనాది బలములు తాఁకి
యార్పులు చేసిన నతఁడు నారసము । నేర్పడ సంధించి యేయ నందఱును
గుదివడి రథవాజి కుంజరంబులను । మొదలేర్పడక యొక్క ముద్దయై పడిరి.
అంత సిగ్గు దలంచి యధిప, సౌబలుఁడు । నంతంత దుశ్శాసనాది వర్గంబుఁ
'బోవకు శైనేయ! పోవకు' మనుచు । రావంబు క్రోశమాత్రము దూఱఁ జీర
నగుచు సారథికి సాత్యకి యిట్టులనియె: । "తగిలెఁగదే కూయి; ధార్తరాష్ట్రుండు
వేఁడి చూపక పోఁడు వెలయఁ బైఁబడక. । వాఁ డల్పబలములవచ్చిన వాఁడె!
ఒయ్యఁబ్రోవను వీని నొక దెబ్బగొనక; । చయ్యనఁ బోరాడు సమితి ముమ్మరము."
నా మందగతి వాఁడు నడపించుచుండ, । వామిపెట్టిన నేఱు వచ్చిన యట్లు
మొనలు రాజులఁ జుట్టుముట్ట శైనేయుఁ । డనుపమ ధైర్యసహాయుఁడై నిల్చి
నరుకృపఁ గన్న బాణ త్రాణ విద్య । పరఁగింపఁ, దేరులఁ బైపైని హరులు
దంతులఁ గాల్వురఁ దమచాపు [3]నోవ్రుఁ । జింతింప కధిపుని శిక్షనెక్కియును

1. మైత్రుఁడై మాయనేమైఁ బోవఁబోవ. 2. శంఖ. 3. నోపు. (మూ).

బాటొండె పగులొండె భస్మమాటొండె । దూటొండె దూలొండె ముమురగుటొండె
వడఁకొండె వదరొండె వ్రాలుట యొండె । దడ[1]యొండె వెఱఁగొండె దమయందుఁ గలిగి
జయము మోమెఱుఁగక చయ్యన వీఁగ । బయ [2]లెత్తి యొంటిపి భయమింత లేక
కనుఁగవ యెఱ్ఱనై కవిసి రారాజు । శిని రాజు నలుగుల సిలుగులఁ బెట్టి
గొడుగు విల్లును జోడు గ్రుచ్చి వోనేయ, । నడుగు దిరుగక వాఁడు నన్ని యుఁదాల్చి(?)
ఫాలపట్టము బీట వాఱ వాలమ్ము । గీలింప శకుని యాక్షితిపసోదరులు
ఎడచొచ్చి పోరి యనేక మార్గములఁ । గడపట వానికిఁ గాలేక పాఱి;
రట్టు నిలువక పాఱ నధిపుండు పాఱ । నెట్టన కాఁకతో నేపాళశతులు
తుటములు గట్టి దుందుభిశంఖపటహ । రటనోగ్రులగుచు నా రథికుఁ దాఁకినను
ద్విరదంబు లిన్నూఱు తేరులునూఱు । హరులు మున్నూఱు భటౌఘముల్ వేలు
మడియునంత రణంబు మాధవానుజుఁడు । కడిమి వాటించి యా ఘట్టంబు గడచి
దుస్సిహోఁ జూడఁ గడున్ విచారమునఁ । ... ... ... ... ...

## దుశ్శాసనుఁడు సాత్యకితో యుద్ధమొనర్చి పాఱిపోవుట

... ... ... ... ... । గచ్చెకు యువరాజు కాలు ద్రవ్వఁచును
అన్న తోడనిపిన యనుచరుల్ లక్ష । తన్ను సేవింప సాత్యకిఁ దాఁకి యప్పుడు
ఉరుతర శైలంబు నొడిసెల ఱాతి । కరణి భుజాశక్తికడిమి వైవంగ
భటులు పిడుగులువోని బాణంబులేయఁ । జిట చిటఁ గోపించి శినివంశకర్త
భల్లాగ్రమునఁ గొండ బరిద్రెవ్వనేయ । నెల్లచో మిడుఁగురు లెగయ నత్తుమురు
తిరిగి తమ్మునె తాఁక దృష్టులు చెదరి । కరి రథంబులు గూలి కౌరవభటులు
తెల్లగాళులు గొని దెరలినఁ, బోక । చిల్లకోలల దుస్సేనుండు నతనిఁ
గప్పియు నతఁడు వక్షము గాడనేయ । నొప్పికిఁ బాఱె ద్రోణుని మాటు దూఱె.
అంత [3]నిత్తెఱఁగున నరి యరుగుటయు । వంత నొంది గురుండు వాని కిట్లనియె:
" యువరాజ, యెక్కడ నొదుఁగ వచ్చితివి ? । తోవకి రావలసెఁ గాఁ [4]దోఁక నీర్సుట్టి !
బలిమిఁ జేతులుచాచి పాంచాలివలువ । లొలిచినగతి గాదు యుద్ధంబు నేఁడు.
అంత చేసిన నీవు నని చూప లేవు ; । వింతయే [5]తీపనివిన వె ప్రాణములు !

---

1. గొండె. 2. లైతి నొంటిని. 3. నివ్వెరగుట. 4. దొంకనిర్సుట్టి. 5. వినవైతివని ప్రాణమగుట. (మూ)

ఒక్క సాత్యకికింత యొదిఁగితే నింక । నక్కిరీటి బకారి యడర నేమగుదొ!
శరణని బ్రదుకుము శమనసూనునకు । మరలి సాత్యకినైన మఱితాఁకు వోయి.''
అని యిట్లు గురుఁడాడ నాతండు లజ్జ । జనియించి వెండియు సాత్యకిఁ దాఁకె.
ఇట ద్రోణుఁ డమ్ముల నెత్తి కౌంతేయ । భటులప్రాణంబులు పారణసేయ
వీరకేతుండను విభుఁడు పాంచాల । వీరుఁ డగ్గురుఁ దాఁకి విలువిద్యనోడి
తలఁగిపో నుండినఁ, దమ్ములాతనికిఁ । గలవారు నలువు రక్కలశజుఁ దాఁకి
చిత్రకేతు సుధన్వ చిత్ర వర్మ్మలును । జిత్రరథుండు నాజిని మృతిపొంద,
నంత ధృష్టద్యుమ్నుఁ డా బంధుమృతికిఁ । జింతిల్లి ద్రోణు మూర్ఛితునిఁగా నేసి
యసిఁ ద్రెవ్వ నేయుదునని తేరుడిగ్గి । వెస ద్రోణు తేరెక్కి విన్నాణమునను
సారథిఁ బడఁ దన్ను సమవేళఁ, దెలిసి । యారథికుఁడు భీతి యాత్మలో లేక
చేరిన లక్ష్యంబు చెండాడుపాటి । దారుణాస్త్రములేయఁ, దన పూఁపుదప్పి
కుంభినికడకు ద్రోఁకులవెంట జారి । సంభృతగతి నిజస్యందనంబెక్కె.
వానిసారథిఁ జంపి వాలంపసోన । సేనాని నిగిడింపఁ జెదరి రథ్యములు
సారథిలేని ధృష్టద్యుమ్ను రథము । దూరాన కీడ్చెఁ బార్థులు తల్లడింప.
మఱి ద్రోణుఁ డాఅని మంటనైరిపుల । నుఱుమాడఁ జొచ్చెఁ బీనుఁగుపెంటగాఁగ.
ఒకచోట గురుఁడును నొకచోట నరుఁడు । నొకచోట సాత్యకియును నేపురేఁగి
చంపుచో నపుడు ప్రజాక్షయమయ్యె; । నింపేది ధృతరాష్ట్ర! యిది నీయుపేక్ష.
వినుమిట్లు ద్రోణుచే వేఁడి వాక్యములు । విని దుస్ససేనుఁడు వేవేగఁ బోయి
త్రైగర్త రథములు తను మూఁడువేలు । చేగ యేర్పడి క్రొల్వ శినివరుఁ దాఁకి
రథ చిత్రగతుల ధరాధూళి యెగయఁ । బ్రథనంబు లోకైక భయముగాఁ జేయ,
నక్కుగా రథికుల నామంత్రణముల । నుక్కడంచి శినీంద్రుఁ డుబ్బి వీక్షించి
దుశ్శాసనునిఁ బదితూపుల గ్రువ్వ, । నిశ్శంక నతఁడును నిష్ఠురాస్త్రముల
రథ రథ్య కేతుసారథి రథికులను । మథన సమూహంబు మలయ నేయుటయు,
మేలని యువరాజు మెచ్చి, సాత్యకియు । వాలిక తూపులవాన నాటినను,
సారథిఁబోనాడి చాపంబు విఱిగి । తేరికి మోసమై దేహంబు ద్రస్సి
యువరాజు మూర్ఛిల్లి యొరఁగిన, నతఁడు । పవనజు ప్రతినఁ జంపక కాచివిడిచె.
అంత సాత్యకిమీఁది యాత్రచాలించి । దంతిపురీశుండు తమ్మునిఁ గొనుచు
గురుని కయ్యంబు గన్గొనవచ్చి యపుడు । పరఁగిన పాండవబలముప్పై నుఱికి

శరములేసినఁ ద్రెవ్వె జమిలి నేనుఁగులు; । ఖురపుటంబులు ద్రెవ్వెఁ గుండె గుఱ్ఱములు;
గుణములు దెగి యొండు గొనిరి విల్కాండ్రు; । మఱియుఁగ హాతిఁ దేర్లుమలమ్రగొనియె;
నేల [1]రోహిణివోలె నెత్తురు వాఱె; । చాల లోఁదాఱిరి సచివు ల య్యనికి.
ఈ భంగి రాజరాజేటున మెఱయ । భ్రూభంగముగ ధర్మపుత్త్రుఁడు గినిసి
ప్రతిదాఁకి యతని చాపము ద్రుంచివైవ । నతఁడు నొండొకవింట నమ్ములు దొడిగి
ధర్మాత్మజుని ఫాలతలము భేదించి । కార్ముక కవచ భంగములు చేసినను
గదవైచెఁ ద్రుంచెఁ జక్రమువైచెఁ ద్రుంచె । నదలించి యసివైవ నదియును ద్రుంచె.
ఇట్టు పార్థుఁడువైవ నితఁడు ఖండింప । నుట్టడఁగని భీమముఖ్యు లెక్కినను
ద్రోణుఁ డిందఱి విప్పఁ దోలిన మరలి । క్షోణీశుఁడేఁగె సజ్జను పోరుచూడ.
అంత బృహత్క్షత్త్రుఁడను కేకయుండు । కౌంతేయ హితముగాఁ గలశజుఁ దాఁకి
బ్రహ్మాస్త్రమేసిన భయమేది యతఁడు । బ్రహ్మయస్త్రంబున భయమార్పనేసె.
అతుల హాహాకార మాసేనఁ జెలఁగ । శితశరంబుల వానిశిర మట్టఁ బాపె.
ధృతిఁ జేదిపతి యంత ధృష్టకేతుండుఁ । బతిమెచ్చ ద్రోణునిపైఁ దేరుపఱపి
సారథిఁ దెగటార్చి చాపంబు దునుమ । దారుణశక్తి యాతఁడు ప్రయోగింప
నదియు వానిశరాగ్ని నణఁగిన నొక్క । గదవైచె; నదియు మ్రగ్గఁగ నాత్మలోన
పోకిరింతఁ జెలంగఁబోలు వీఁడనుచు । నేకాండమైన విల్లెత్తి గురుండు
మెఱుఁగునారసమున మెడ దూరనేయ । నొఱలుచునెగసివాఁడుర్విపైఁ గూలె.
వాని పుత్త్రుఁడు దాఁక వాని గురుండు । సేన లార్భటములు సేయ ఖండించె.
చొచ్చి జరాసంధ సుత సహదేవుఁ, । డచ్చటఁ దాఁకి కయ్యము చాలఁజేయ
రమ్య కుండలములు రాయు తచ్ఛిరము । యామ్యబాణాగ్నికి నాహుతి చేసె.
దొరల ద్రోణుండట్లు దొరఁకొని చంపఁ । గరువలిపట్టి శంకాతంకమునను
(సేనానివంక వీక్షించి, "యాచార్యుఁ । బూని యాఁపకయున్నఁ బొందునెజయము!")
అనునంత క్షత్త్రవర్మాఖ్యుండు శ్వేతు । తనయుఁ 'డాతని నేనె తఱుముదు' ననుచు
దీమసంబున ద్రోణు తేరంతఁ గదిసి । హేమపుంఖములైన యిషువులఁ బొదివి
వింటికొప్పౌకకోల విఱిచిన, గురుఁడు । కంటికప్పుడు కెంపుగదుర నయ్యమర
పగతు పౌరుషము సైఁపక నొండువింటఁ । దెగ నిండ సాయకత్రితయంబు దిగిచి
విడిచిన, నది డేగవిధి వాని శిరము । నడికొత్తి కొనిపోయె నరములతోడ.

---

1. రోగిణి. (మా)

ఆ[1]వటుగట్టైన నప్పుడాత్మలోన | నోర్వఁగఁ జేకితానుండు తానెక్కి
గురుతూపులకు భీతి [2]గుఱికొని యడర | గురుబలంబులు గెలిగొని వెసఁ బాఱె.
మఱి యెవ్వరును నిల్వ మగఁటిమి లేక | నెఱిఁ బాండుతనయ సైనికు లట్లు పాఱ
ద్రుపదుఁ డొక్కఁడు సిగ్గుతో నిగ్రహించి | యపుడు పోరాడె ద్రోణాచార్యుతోడ.

## ధర్మరాజు భీము నర్జునునకుఁ దోడంపుట

విను మాంబికేయ, యవ్వెనుక ధర్మజుఁడు | మును పాంచజన్యపు మ్రోఁత యాలించి
వెనుక నర్జును శంఖ నిస్వనంబు | వినక భీమునిఁ జేరి విన్ననై పలికె:
“అన్న! భీమ! కిరీటి యచ్చోటి నొంటి; | నిమ్ము జఱ్ఱున జాఱె మిహిరుండు నకట!
“పోవన్న తోడుగాఁ బుణ్యమై చేయు | నావెంటఁ బంపియు నాత్మ నేనమ్మ
విష్ణు శంఖరవంబు వినవయ్యెఁ గాని | జిష్ణు శంఖరవంబు చెవులార వినము.
ఏ దాయనో డాయు[3]నేల! యచ్చటకుఁ | బో, దాయలకుఁ బోయి పొడచూపవన్న!
ఆకడ కరుగుట కనుజుఁ గాంచుటకు | నాకును నీ సింహనాదంబె గుఱుతు.
నరుఁడు తీఱిన వెన్క నాకుఁ బోదనుచు | హరి పోరుచున్నాఁడొ యదియు నేనెఱుఁగ.
ఒకని తమ్ముని బంచి యొప్పరికించి | రకట పాండవులని యపకీర్తి మనకు.”
ననఁగ భీముఁడు నవ్వి: “యశ్లీల దేవ! | మన కిరీటికి నేల మహి నిట్టి దశలు!
అనలు తేరును విల్లు హరియును గలుగ | నని సురాసురులకు నతఁడు భీతిలఁడు.
క్షితిఁ దోడఁబుట్టిన చిచ్చునా నీవు (?) | మతిఁ దలంకితి దీని మాన్తు నేఁబోయి.”
అని భీముఁ డచటి సేనాధీశుఁ గదిసి, | “విను ద్రోణుబారికి విభుఁ గాచికొనుము.
నృపున కెవ్వనిఁ దోడు నీవిడి తనిన | నపుడు క్రీడికి నిన్ను నటఁ జెప్పవచ్చు.
పోయెద నేలిక పొమ్మన్న పనులు | నేయరాదనరాదు సేవకులకును.”
అనిన ధృష్టద్యుమ్నుఁ: “డరుగు మేఁగలుగ | విను ద్రోణుఁడెవ్వఁడు విభుఁ దేఱిచూడ.
[4]ఉప్పనబట్టైలై యున్నది గురుని | దప్పించుకొన సేన దండింపు చొరుము.”
నా విని భీముఁ డానందించి వచ్చి | భూవరునకు మ్రొక్కఁ బొసఁగ నాతఁడును
ఆలింగనము చేసి యనుజు దీవించి | చాల శంఖాది నిస్స్వనములు బెరయ
ననిచినఁ గదలి నెయ్యమున విశోకుఁ | డనువాని నిజసూతు నల్లనఁ బలికె:

---

1. వటుకట్టైన. 2. గురుతనంబడర. 3. చెల్లనచ్చోట. 4. ఉప్పెన. (మూ)

'బాణధారల చాయ పదము చూపెదిని । ద్రోణునికై చక్క ద్రోలు మీ రథము.
అదె కుమారులమూఁక, యదె రాజలోక, । మది గాని పనియేమి హత్తింపునరుని.'
అని చెప్పి నిశ్శంక నరుదేరఁ దాఁకి । మును యువరాజు దుర్ముఖ సుదర్శనులు
విందా నువింద వివింశతి హస్త । బృందారకాభయభీము లన్వారు
జననాథ, దుర్విమోచన రౌద్రకర్మ । లనువార లాదిగా నందంద యేచి
జాతి వైరమునఁ బ్రచండ కాండములు । భీతిగాఁ గురిసి యా భీముచే నపుడు
పర్వి బృందారకాభయ రౌద్రకర్మ । దుర్విమోచనులు మృత్యువుపాలఁ జనిరి ;
విందాను విందులు ప్రీలిరి ; మఱియు । నందు సుదర్శనుఁ డంతకుఁ జేరె.
చిక్కినవారలు చెదరి పాఱంగ । నిక్కగాఁ బెడతలవేసి భీముండు
రువ్వునఁ బిడుగువాఱుట దోఁప గురుని । నవ్వేసఁ గదియుచో నమ్ములఁ గ్రాఁగి
యుగ్రుఁడై భీము : "నోహహో పోకుపోకు । సుగ్రహమని పోవఁ జూచెదు విడువ.
నన్ను గెల్వక నీవు నరుఁడును బోలె । నున్నని మాటల నుడివి పోయెదవా!
అట నిన్నుఁ బోనిచ్చి యతనిఁ బోనిచ్చి । యిట మ్రొక్కుబడికినే యేనున్నవాఁడ!"
అనినఁ గోపాంధుఁడై యనిలజుఁ డనియె : । "నిను వేడుకొనుటయు నిజమె యర్జునుఁడు!
పూని దేవవ్యూహములు చొచ్చుచోట । మానుష వ్యూహంబు మఱి క్రీడి కెంత?
గురుఁడని యొకమ్రొక్కు గొమ్మన నతని । వరున మొఱంగక వాక్రుచ్చి." తనుచు
గద త్రిప్పి వైచినఁ గడఁగి యాచార్యుఁ । డొదిఁగిన నదివోయి యురు తేరుదాఁకి
మసిప్రోవు చేసి క్రమ్మఱ భీముకడకు । వెసఁబోయె ; నతఁడును వేఁజొచ్చె నొడ్డు.
చొచ్చినభీము నీసుతు లడ్డగించి । వచ్చి చిచ్చారు దీవ్రపుఁ దూఁపులేసి
యిందేమి బ్రదికెడి నితఁడని తోఁప । నందడించిన, రౌద్రసంపత్తి నతఁడు
గదగొని పూఁచిన, గర్భముల్ గలఁగి । చెదరిరి ; సైన్యంబు చెదరె నచ్చోంత.
ఉన్నతి గురుఁడంత నొక్క తేరెక్కి । మున్నాడి వెసఁబోయి ముద్దర గట్ట
రువ్వాజివ్వను గాడ్పు రువ్వ బాణములు । త్రవ్వితండములుగాఁ దఱిమి యేయఁగను
దన సాయకములెంత తానెంత యనుచు । ఘనుఁడంతఁ దన తేరు గదగొని డిగ్గి
వానలో వృషభంబు వచ్చున ట్లంప । సోనలోఁ దలదూర్చి చొచ్చి యేతెంచి

... ... ... ... ... । ... ... ... ... ...

ద్రోణుఁ డప్పుడు మేనుతుడుచుక లేచి । ప్రాణాశచేఁ దన్ను భావించు కొనుచు
నొండొకరథమెక్కి యొద్దువాఁకిటనె । యుండెఁ బాండవసేన లొత్తి రాకుండ.

## భీముఁడు ద్రోణాదిరథికుల నుత్తరించి యర్జునుఁ జేరఁబోవుట

అంత సారథి వచ్చి యటఁ దేరుచూపఁ । బంతంబుతో నెక్కి పావని మట్టి,
ఘోరాస్త్రతతి మార్గ్ఘోషంబు తెలుప । వారక వ్రేయుచు, వాఁడి వేఁడిమికి
భోజాధిపతులుఁ గాంభోజాధిపతులు । నాజాడ గలిగిన యధిపులు మఱియు
సోమరులై స్రుక్కి సుడివడి సురిగి । మోమోట ముసు జెడి మోడ్పడి వ్రొగ్గి
పంచులై పసదప్పి ప్రాల్మాలి పగిలి । కంచుమిం చై పాఱఁ, గడుసంభ్రమమునఁ
దెఱపిగాంచి బకారి తేరు దోలించి । తెఱఁగొప్ప నర్జును తేరు దవ్వులను
దివ్యలాంఛనముచేఁ దెలిసి పెల్లార్వ, । సవ్యసాచి యొఱంగి చయ్యనఁ దిరిగి
యతనిఁ గాంచి చెలంగి హరియును దాను । వితత శంఖములొత్త, విని ధర్మరాజు
పావని జయము బీభత్సు నేమంబు । నావెంట నెఱిఁగి ధైర్యము దెచ్చుకొనియె. ”
అని చెప్ప భీతుఁడై యాంబికేయుండు : । “ మనకేటి జయమింక ! మారుతి చొచ్చె ;
శినివరుఁ డొకఁడు చొచ్చినఁ జొప్పువడఁడు. । తనయుఁడేమని చింతఁ దగిలెనోయువుడు!
మొనలెంత వణఁకిరో ముప్పురి యనికి ! । వినవోప సంజయ, విడు కథ. ” యనిన
“ ద్రౌపది నొగిఁబట్టి తద్ద వాపోవ । నోపితి విది వినవోపవా భూప !
పరదుఃఖ నిజదుఃఖ పరిపాటియట్ల । సరిగదా శేషంబు సకలంబు వినుము. ” (1)
అని సంజయుఁడు చెప్పు : “ నట్లార్చు భీముఁ । గనుఁగొని యేతెంచి కర్ణుండు దాఁకి
భుజముల బహు బాణములు గ్రుచ్చి విల్లు । రజముగా నేసి సారథి మూర్ఛ పుచ్చ,
బొమముడితో వాయుపుత్త్రుండు కర్ణు । విమల ఖడ్గము వైచి వింటికిఁ బఱపి
యొండువింట లలాట మురము బాహువులుఁ । గండలు గ్రమ్మ రక్తము చిమ్మనేయ
వాఁడంత పరశక్తి వైవ వాయుజుఁడు । మూఁడుతూపుల నది మొదలికి నఱికి
నేసకంబొకకోలఁ జించి వక్త్రమున । నేసె నమ్ములు రక్త మిల మడుఁగుగట్ట.
అంతఁ గర్ణుని ఘోరమగు నవ్వు నవ్వి । యింతటఁ దెగఁ జూతు నేను నిన్ననుచు
ధనువంతఁ ద్రుంచి యంతన సూతుఁ ద్రుంచి । యనిలజుఁ డతని రథ్యములఁ ద్రుంచినను
అలసి కర్ణుఁడు వాఱె ; నవ్వు డా కర్ణు । బలమెంత చావదు పావనిచేత !
అట్లు కర్ణుఁడు వాఱి యాత్మజు రథము । మెట్టినఁ బఱతెంచి మేదినీవిభుఁడు

## దుర్యోధనుఁడు ద్రోణుని దూఱనాడుట

గురుని నిట్లని దూఱెఁ : “ గూడునే ద్రోణ ! । చొరవిడిచితి నేనచూరఁబో భీము.
శైనేయ పార్థులు చాలరే మొదల ! । నే నెట్లు రక్షింతు నింక సైంధవుని ?

చేకొని వార్ధి శోషించుట గాక । నీ కొకఁడెక్కుఁడే నిలిపెడ ననిన?
ఏము సాత్యకి కోడ నీ యపకీర్తి । నీ మీఁద ప్రాలదే! నేరవు తెలియ;
మా భాగ్య మిట్లుండె మాట లింకేల । ఏ భంగి నాకార్య మిటమీఁద?" ననిన
నాతఁడిట్లను: "నాకు నరుఁగఁగ నాకు । తోతెంచి పెళ్ళల దూతైన నన్న?
భీమార్జునుల నడ్డపెట్టరాదనుచు । నే మున్న చెప్పనా! యిప్పు డెఱింగెదవు.
సైంధవుఁ గాపున్న సచివులు నీవు । బంధురగతి క్షత్రపుఁడు వీరలకు.
ఏను నిక్కడనున్న హితవు నీ వెఱుఁగు; । దానికి నిలిచితి రాజులనెల్ల;
కావున నే రాను; గయ్యాలచోటు । నీవున్న జయముగు నెమ్మిఁ బో." మ్మనినఁ
దను దాని పుచ్చికొని ధార్తరాష్ట్రుండు । మరలి యేతెంచుచో, మధ్యభాగమున
మును బోరఁ జేసుని మున్నుఁ గ్రీడిఁ గూడఁ । జనరాక చిక్కిన చక్రరక్షకులు
నొగి యుధామన్యుండు నుత్తమౌజుండు । నగపడ నరలించి యతఁడు వోనీక
యనిసేసె." ననుటయు నాఁబికేయుండు: । "వినిపింపు వారెట్లు వెడలిరయ్యెఁక?
నిరువురఁ గృతవర్మ యెట్లు వోసిచ్చె? । నరుగుట యెట్లు వారంతద?" వ్వనిన
సూతజుఁడిట్లను: "క్షోణీశ, భోజుఁ । డా తెఱంగునఁ దమ్ము నాఁగిన వారు
సంకేతములు చెప్పి చయ్యన రెండు । వంకల నయ్యొడ్డు వ్రచ్చక వెడలి
క్రీడి వోరెడుచోటు కేతులక్ష్యమున । నోడక [1]యెత్తేఁగి యయ్యొడ్డున కేఁగి
చించుక మఱియుఁ జొచ్చిరి క్రీడిరథము; । నించుక మున్నాడి యితఁడంతఁ గూడె.
కూడి ముప్వురు నట్లు ఘోరాజి సేయ । నోడక నృపుఁడందు నుత్తమౌజుని
విరథునిఁ జేసిన, వెస యుధామన్యు । వరరథారోహంబు వాఁడును జేసె.
ఇరువురుఁ గూడి యయ్యిభపురాధీశు । విరథు విగళితచాపు వికృతుఁగా సేయఁ
గుపితుఁడై చాపంబుగొని వాని తేరు । నృపుఁడు రెండుగనేవ నిలువక వారు
తేరులు విడనాడి దేవేంద్రతనయుఁ । జేరిరి; పతి శల్యుఁ జేరి తేరెక్కె.
ఆలోన రథముతో ననువొంది కర్ణుఁ । డాలంబునకు భీము నలుకమైఁ బిలువ
బరిగోల పోటుల భద్రేభమనఁగ । నెరవుగాఁ దిరిగి యుర్వీరుండు గదియ
వెడతూపులకు మిన్ను విరివిలేదనఁగఁ । గడు నుగ్రరణమయ్యెఁ గర్ణభీములకు.
నొగులు పతాకలు నొచ్చు రథ్యములుఁ । బగులు రథాంగముల్ పప్పగు విండ్లు

1. ఱేఁగి యయ్యొడ్డుగున. (మూ)

